D.V.S PRODUCTIONS




మరచినా మరపురాని జీవిత సత్యాలతో
చిరకాలం మీ హృదయ సీమలలో
నిలిచే రమ్యమైన చిత్రం!

డి.వి.యస్. ప్రొడక్షన్స్

# ధనమా? దైవమా?

దర్శకత్వం
సి.యస్.రావు (B.A.,L.T.)

నిర్మాత:
డి.వి.యస్.రాజు

ఆంధ్ర: విజయ. సీడెడ్: జయలక్ష్మి నైజాం: ఉషా ఫిలింస్. మైసూర్ గోకుల్ పిక్చర్స్. నార్త్ ఇండియా: శ్రీ ప్రసన్నా ఎంటర్ ప్రైజెస్

## గేయం

తే 6—10—72వ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఉత్తరాలలో 'గేయము' అన్న శీర్షిక క్రింద శ్రీ ఆరాధ్యుల నరసింహ మూర్తిగారు (చెన్నై) వ్రాసిన ఉత్తరము చూచితిని. స్వరాజ్య గీతామృత కావ్యములోని గేయము కీ: పూడి పెద్ది కాశీవిశ్వనాథం వ్రాసి నట్లుగను పద్యములు నేను వ్రాసినట్లుగను తన బంధువగు కాశీవిశ్వనాథమే తనతో చెప్పినట్లుగను శ్రీ నరసింహ మూర్తిగారు ప్రకటించినారు. కాని ఇది ఆయున చని పోయిన తరువాత చేయబడిన కల్పన మాత్రమే.

కీ: శే: కాశీవిశ్వనాథం, నేను సతీర్థ్యులము, మిత్రులము. కవులు, తమ తమ రచనలను మిత్రులైన వారికి చూపించు కొనుట వారి సూచనలను అవసరమనుకొన్నపట్ల అంగీకరించుటయు, సంప్రదాయ విరుద్ధము గాదు. మిత్రుడైన విశ్వనాథంకు నా 'స్వరాజ్య గీతామృత కావ్యము'ను చూపించుట జరిగినది. అతడు కొన్ని సూచనలు చేయుట జరిగినది. 1920 సంవత్సరం నుండి నేను సహాయ నిరాకరణోద్యమములో పని చేయుచు, 'స్వరాజ్య, గీతామృతము కావ్యములో'ని గేయములను, పద్యములను, పూరూరు ప్రచారము చేయు చుండెడి వాడను. ఆ సమయములో రాజమహేంద్ర వరమునుండి ఒక పెద్ద మనుష్యుడు వచ్చి, ఈ పుస్తకమును అచ్చు వేయుటకు అనుమతి యియ్యవలసినదిగా నన్ను కోరెను. పుస్తకము అచ్చైన యెడల ఉద్యమము విపుల ప్రచారము నొందగలదన్న ఉద్దేశముతో నేనందులకంగీకరించితిని. నేను నాదగ్గర గల వ్రాత పతి సహాయముతోనే, ప్రచారము కొనసాగించుచూ ఉద్యమములో నిమగ్నుడనై యుంటిని. ఆ సమయములో పుస్తక ప్రచురణ కార్యక్రమమునుపరిశీలించెడి అవకాశము నాకు లేక పోయినది.అచ్చైన పుస్తకమును ఆనాటి ప్రభుత్వమువారు నిషేధించిరి.

'నస్వరాజ్య గీతామృత, గ్రంథ కర్తగా నాపేరుతో, బాటు మిత్రుడు విశ్వనాథం పేరుకూడా చేర్చబడినది. ఆ పుస్తక కర్తృత్వముతో ఏ విధమైన సంబంధములేని విశ్వనాథం పేరు నాపేరు ప్రక్కను ఎట్లు చేర్చబడినదో, ఎందులకు చే బడినదో ఎవరీపని చేసినారో, ప్రభుత్వము నాపై కేసు నడిపించునంత వరకు నాకు తెలియదు. పుస్తక ప్రచురణకునంగీకరించినది ఉద్యమముయొక్క విపుల ప్రచారమును కోరియు కాని నాపేరు ప్రఖ్యాతులు కోరి కాదు. గ్రంధము ప్రభుత్వ నిషేధములో నుండుట చేత నేనుచేయగలిగినదియు ఏమియును లేదు.

విదేశీ ప్రభుత్వమువారు పుస్తకమును నిషేధించి కేసు పెట్టగా నిజముగా ఆ గ్రంధ కర్తృత్వములో తనకు భాగములేదని, విశ్వనాథం సులువుగా క్షమాపణ చెప్పి తప్పించు కొనుట జరిగినది. తర్వాత పుస్తక మంతటివిూదను ప్రభుత్వము కేసు పెట్టుటయును, దాని కర్తనైన నేను సెక్షన్

## ఉత్తరాలు

124—ఎ, ఐ. పి. సి. క్రింద తొమ్మిది నెలలు కఠినశిక్ష, ఐదుకొందల రూపాయలు జరిమానా, అది చెల్లించ కుండిన, యెడల మరి మూడునెలలు కఠినశిక్ష— మొత్తము 12 నెలలు (1922—1923 సంవత్సరంలలో) జైలుశిక్ష రాజమహేంద్ర వరము సెంట్రల్ జైలులో అనుభవించుటయును జరిగినది.

విశ్వనాథం సజీవుడై ఉన్న కాలములోనే ఈ గేయము రేడియోలో నా పేరున ప్రసారము చేయబడినది. కాని రేడియోవారు ఒకటి రెండు స్వాతంత్ర్య దిన తేదీలలోన ఈ గేయమును అతని పేరిట ప్రసారము చేసి నట్లుగా శ్రీ నరసింహ మూర్తిగారి ఉత్తరము పత్రికలో చూచిన పిమ్మటనే తెలిసి కొంటిని. ఈ మార్పు ఎట్లు జరిగినదో చాలా చిత్రముగా యున్నది.

సహాయ నిరాకరణోద్యమ సమయములో ప్రచారమైన గేయములలో ప్రప్రథమ మైనదియును స్వరాజ్య గీతామృతములోనిదియును, అగు 'దండాలు, దండాలు భారత మాత' అనుగేయము యొక్క నా కర్తృత్వమును గూర్చి నా డెబ్బది మూడేండ్ల నాటి ఒక్కటే ఒక్క మాట,

' ఎవ్వరేమను కొన్న నాకేమి కొదవ?
నా కవిత్వంబు నిజము'

—వడ్డాది సీతారామాంజనేయకవి. (స్వరాజ్యకవి)

తణుకు

కేంద్ర మంత్రి శ్రీ మోహన్ కుమారమంగళం ఢిల్లీ పాలం విమానాశ్రయానికి సమీపంలో మే 31వ తేదీ రాత్రి జరిగిన విమాన ప్రమాదంలో మరణించారు.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938—1972)
శుక్రవారం : 15-6-73
శ్రీ ప్రమాదీచనామ సం॥ జ్యేష్ఠ శు. ౧. పూర్ణిమ
సంపుటము : 66 సంచిక : 39
స్థాపితం : 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక


వాళ్లు ఎక్కడికి వెళ్తున్నారో వాళ్లకే తెలీదు!
తెలంగాణా సమైక్యవాదులు


కేదార్ పాండే పరిపాలనకి వ్యతిరేకంగా కమ్ముకుంటున్న తుఫాను మేఘాలు
మార్పు చేయబడిన బీహారు మంత్రివర్గం
రాబోయే తుఫానుకి ఈ గొడుగు ఆగుతుందా?




కాస్త ఆగు, నీ అంతు తేలుస్తా
ఆంధ్ర సమస్య

# ఆంధ్ర సమస్య పరిష్కారం అంటే ఏమిటి?

'ఆంధ్ర సమస్య' పరిష్కారం గురించి ఇంకా మాటలు వినిపిస్తున్నాయి. అసలు ఈ సమస్య ఏమిటి?

'ఆంధ్రప్రదేశ్' అనబడే రాష్ట్రంలో ఒక ప్రాంతంవారు సంరక్షణలు, ప్రత్యేక సదుపాయాలు కావాలంటున్నారు. తమ ప్రాంతంలో తమ రాష్ట్రంలోనే ఉండే మరొక ప్రాంతంవారు స్వేచ్ఛగా జీవించటానికి వీలులేదంటున్నారు. రెండవ ప్రాంతంవారికి ఉద్యోగం, విద్య మొదలయిన వాటిల్లో తమతోబాటు సమానహక్కులు ఉండటానికి వీలులేదంటున్నారు. ఇటువంటి పరిస్థితులు దేశంలో మరే పెద్ద రాష్ట్రంలోనూ లేవు.

ఇక ఆంధ్రప్రాంతంవారు తమకి సమాన హక్కులు చాలన్నారు. ప్రత్యేక సంరక్షణల కోసం, సదుపాయాలకోసం అడగలేదు. వీటిని అడిగినందుకు అధికారంలో ఉన్న వారు దండోపాయాలని అనుసరించినప్పుడు విసిగిపోయి వేరే రాష్ట్రం కావాలన్నారు. ఆంధ్రప్రాంతంవారు తమ ప్రాంతంలో తమ రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకి చెందినవారు ఉండటానికి వీలు లేదనటం లేదు.

తెలంగాణా ప్రాంతపు సమైక్యవాదులు తమ ప్రాంతంవారికి సంరక్షణలు, ప్రత్యేక సదుపాయాలు అక్కరలేదని స్పష్టంగా చెప్పటం లేదు. ఆంధ్రప్రాంతపు సమయిక్య వాదులు కూడా ఇలా చెప్పినట్లు తోచదు.

సమయిక్యత పేర ఆంధ్రప్రాంతం వారిని రెండవ తరగతి పౌరులుగా ఉంచుదామని వీరందరూ ప్రయత్నిస్తున్నారు.

ఆంధ్రలో పెద్ద ఉద్యమం లేచి ఉండకపోతే వారు తమ ప్రయత్నాలని మరింత ధైర్యంగా చేసేవారే. ఇంత ఉద్యమం జరిగింది కనుక డొంకతిరుగుడు మాటలతో, కాలాయాపనతో తాము తలపెట్టింది సాధిద్దామని ప్రయత్నిస్తున్నారు.

'ఆంధ్ర సమస్య' అంటే వేరే ఏమీ కాదు. ఆంధ్రప్రాంతం ప్రజలకి అన్యాయం తలపెట్టినవారి ప్రయత్నాలు సాఫీగా జరుగకపోవటమే. ఇటువంటి ప్రయత్నాలు నెగ్గినప్పుడు 'సమస్యా పరిష్కారం' అయిందని కొందరో అనటం మొదలుపెడ్తారు...

—రావు

★ అందర్నీ — ఆకట్టుకునే — ఆటగాడు వేలుపిళ్లై.

అందరూ పిలిచేపేరు జంగిడీ. తంజావూరు జిల్లాలో ఓ కుగ్రామంలో పుట్టి ఆంధ్రదేశపు కోస్తాలో విస్తరిల్లుతున్న ఓ ప్రముఖ పట్నంలో పదేళ్లనించి తన స్వశక్తితో పొట్ట పోసుకుంటున్న జంగిడీ వయస్సు పేరుబట్టి అందరూ ఊహించి అంచనా వేసుకునే ఏ నలభయ్యో కాదు. బస్సుల్లో మినీస్కర్ట్సు వేసుకునే భామినీమణుల వయస్సుల్లో సరిగ్గా సగం. అంకెల్లో చెప్పాలంటే ముచ్చటగా ఇరవై. శ్రీనాథుర్ని ఆపాంతం అర్థం చేసుకోవాలనుకుంటే రెడ్డిరాజుల చరిత్ర సంపూర్తిగా తెలుసుకోవాలి. వెలుగువిలువ గుర్తించాలంటే చీకట్లో కళ్లు తెరవాలి. కొవ్వొత్తి ప్రజ్వరిల్లాలంటే తను కరగాలి. జంగిడీ గురించి ఒక్కక్షరం చెప్పటానికి కుప్పుస్వామి గురించి కనీసం రెండక్షరాలు చెప్పాలి.

కుప్పుస్వామి పూర్తిపేరు కుప్పుస్వామి. అందరూ పిలిచేపేరు కుప్పుస్వామి. అతని తల్లితండ్రులు పెట్టినపేరు కుప్పుస్వామి. చింతపండును చూస్తే కుప్పుస్వామిని చూడక్కర్లేదు. కుప్పుస్వామిని చూస్తే చింతపండును చూడక్కర్లేదు ఉపమాన ఉపమేయములకు పూర్తిగా అభేదం. గొప్ప 'రూపకాలంకారుడు!'

కుప్పుస్వామిది కూడా వేలుపిళ్లై పల్లెటూరే. పదేళ్లకిందట వయస్సులో పదేళ్ళ తేడా ఉన్న ఇద్దరూ కల్సి ఓ జంగిడీ చేత్తో పట్టుకుని బుజంమీద చెరోతువ్వాల్తో ఆంధ్రదేశం వలస వచ్చారు. ఇద్దరూకల్సి వడలువండి అమ్మటం మొదలు పెట్టారు. కొంతకాలానికి ఇద్దరూ కల్సి ఓ టీ బడ్డీ తెరిచారు. ఇద్దరూ కల్సి రాత్రింబవళ్లూ కష్టపడ్డారు. ఐదేళ్లలో ఇద్దరూకల్సి స్థిరపడ్డారు. కాని ఈ స్థిరపడ్డంలో స్థానాలు మారాయి. ఇప్పుడు లాగే వేలుపిళ్లై వంట షెడ్డులో రుబ్బురోలు దగ్గరుండి పోయాడు. కుప్పుస్వామి హొటల్లో కేషుబాక్సు దగ్గర సీలింగు ఫానుకింద జేరాడు. ఇద్దరికి దగ్గిరతనం తక్కువైంది. ఇద్దరి మధ్యా మధ్య హోల్లో సర్వర్లు చేరారు. హోటలు పెరిగింది. వాళ్లిద్దరిమధ్యా దూరం బాగా ఎక్కువైంది. మూల్గుతున్న డబ్బుతో ప్రశాంతంగా బ్రతకటానికి వీలుగా ఊరిమధ్య కుప్పుస్వామి మేడ కట్టుకున్నాడు. పశువులకొట్టం నిర్మించాడు. పశువుల్ని కొన్నాడు. అర్ధాంగిని సంపాదించుకున్నాడు. పిల్లల్ని కన్నాడు. అతనిలాగే అతని పశువులు కూడా ఈని వృద్ధి పొందాయి. మూల్గే డబ్బు లేక ప్రశాంతంగా బ్రతకటానికి వీలుగా ఊరికి చివర్ని ఓ గుడిసెమాత్రం వేసుకున్నాడు వేలుపిళ్లై.



కృష్ణస్వామి — మాసిన లుంగీవదిలి రంగుల లుంగీలోకి దూరి వేషం మార్చాడు. వ్యాపారం మార్చాడు. హోటల్ని మరొకరికి అమ్మేసాడు. సినిమాహాలు కొన్నాడు. హోటలుతోపాటు తన పెరిగిన అంతస్తుకు పునాదైన వేలుపిళ్ళైని అదే జీతానికి అమ్మకానికి పెట్టాడు. కొత్తగా హోటలు కొనుక్కున్న ఆసామి వేలుపిళ్ళై వంట నైపుణ్యాన్ని కొనటానికి సిద్ధపడ్డాడు. కాని వేలుపిళ్ళై అమ్ముడు పోటానికి అంగీకరించలేదు. ఒకనాటి మిత్రుడు దగ్గర సెలవు తీసుకుని ఒకనాడు తన దేశం నుండి తెచ్చుకున్న జంగిడితో తను వేసుకున్న గుడిసె చేరాడు.

గుడిసెలో కాళ్ళు ముడుచుకుని డొక్కలోకి తన్నిపెట్టుకుని ఆకలితో బాధపడటానికి వేలుపిళ్ళై జవసత్వాలుడిగిన వయస్సువాడు కాదు. నిండుగా కండపుష్టి, సమృద్ధిగా సమయస్ఫూర్తి ఉన్నవాడు. చేతికి పని చెప్పాడు. వండిన వడలు జంగిడీలో పేర్చి బుజం మీదికెత్తి నోటికి పని చెప్పాడు. ఊరి మీద పడ్డాడు. గలగలా నవ్వే కొందరి నవ్వు వెల్లువ వెనుక వేడి కన్నీటి వాగు ఉంటుంది. ఉత్తర

# జంగిడీ

దక్షిణ ధృవాలుగా మెలిగే వ్యక్తుల మధ్య ఏదో రకమైన 'ఆకర్షణ' ఉంటుంది. కాలేజీలో చదివే ప్రతిఒక్కరూ ఉడ్‌లాండ్ హోటల్లో వేడి వేడి ఇడ్లీ తిని ఉలెన్ సూట్లలో ఊర్వశీ సెంటేసి ఏవ్. ఏవ్‌లో పిక్చర్లు చూడలేరు. ఏవరూ చూడకుండా ఊరి చివర ఐదు పైసలకు దొరికే వడ తిని కడుపు నిండా కొళాయి నీళ్ళు పట్టించే విద్యార్థులూ ఉంటారు. ఈపై ఉపోద్ఘాతం వేలుపిళ్ళైతో నా పరిచయానికి నాంది పలుకుతుంది.

ఫిజిక్సు లాబ్‌లోంచి మనస్సులో పేరుకున్న 'న్యూటన్సురింగ్సు' చెరిపేసుకుంటూ బయటికొచ్చాను. ఉడ్‌లాండ్ పరిసరమంతా వేడి దోశె వాసనతో ఆకలిని రగిలిస్తోంది. తప్పించుకోటానికి వడిగా నడిచాను.

'వడసార్! వడ' అతను జంగిడని నెత్తిమీదుంచుకుని అరుస్తున్నాడు.

'ఏయ్ జంగిడీ!' నేను పిలిచాను. అతను నా దగ్గరకొచ్చాడు.

'వడెంతోయ్?' అడిగాను.

'ఏంతో ఏమిటి సార్? అయిదుపైసల కొకటి వేడి సరుకు. ఎన్నివ్వమంటారు?'

'మూడియ్యి.'

అతను పొట్లం కట్టిన వడలు తీసుకుని డబ్బు కోసం జేబులో చెయ్యి పెట్టాను.

'అరే! ఏమైపోయాయి? లాబ్‌లోంచి వచ్చేప్పుడు పదిహేను పైసలుండాలిగా.' గబగబా అన్ని జేబులూ వెతికాను. చిల్లు పడ్డ జేబు వెక్కిరించింది నా మందమతిని.

'ఉంచవోయ్. మళ్ళా ఇప్పుడే వచ్చి తీసుకుంటాను.' అయిష్టంగా జంగిడీలో పొట్లం ఉంచి ఇబ్బందిగా మొహం పెట్టి, మొహమాటంగా వెనక్కి తిరిగాను.

'ఏవండోయ్ మాట.' అతను కేకేసాడు.

నాకు భయమేసింది. 'పెద్ద కొనేవాడికి మల్లే తీరిగ్గా బేరమాడి వేడుగ్గా పొట్లాలు చుట్టించటమెందుకు?' అని అనటానికి వాక్కులు వెనుకంజ వేసాయి.

నేను వేగంగా ముందుకు నడిచాను.

'ఏవండో! నిన్నేనండి బాబూ' అతను నా వెనక పడ్డాడు.

తథ్యం! నా పరువు వేలానికి రెడీ.

'పారిపోతారేమండీ?'

'అబ్బే...ఏం లేదు. పర్సు తేవటం మర్చిపోయాను. ఏమనుకోకు. డబ్బులున్నాయనుకుని పొట్లాం కట్టించాను.'

అతను నవ్వాడు.

'భలేవారే. మంచి ఆకలిమీదున్నారని మీ వాలకం చెబుతోంది. డబ్బులు రేపివ్వచ్చు. తినండి.'

వడలపొట్లాం చేతులో పెట్టాడు. అతని మొహంలోకి చూసాను.

'ఆకలిబాధ నాకు తెల్సుసార్. తినండి' ఆప్యాయంగా అన్నాడు. ఎంత వెతికినా ఆ గొంతులో వ్యాపార సరళి ధ్వనించలేదు. సిన్సియార్టీ ప్రతిధ్వనిస్తోంది.

వడలు తిన్నాను. తర్వాత అడిగాను.

'నీ పేరేంటి?'

'పిల్చారుగా, జంగిడీ.'

'అదికాదు. అసలు పేరు.'

'అంతా ఏయ్ జంగిడీ అంటారు. మీరు మాత్రం జంగిడీ అని పిలిస్తే చాలు.' ఆనాడు పదిహేను పైసల అరువుతో ప్రారంభమైన మా స్నేహం ఊహించని వేగంతో వృద్ధిపొంది మేం ఇద్దరం తీర్చుకోలేని ఋణానుబంధం ఏర్పరిచింది. నా

చదువు పూర్తయింది. చేసిన సిఫార్సు వల్ల వచ్చిన డిగ్రీ కామర్సు క్వారన్‌లో క్లర్కు ఉద్యోగమిచ్చింది. నేనిప్పుడు ఉడ్‌లాండు హోటల్లో వేడివేడి ఇడ్లీ తిని ఉత్తన్ నూట్సులో ఊర్వశి సెవెంటీ ఎమ్.ఎమ్. లో పిక్చర్లు చూడగలను. కాని జంగిడీ మారలేదు. నా పెరిగిన అంతస్తు ఇదివరకు తరచుకల్సే జంగిడీ కాలాన్ని తినేసి డబ్బును మిగులుస్తోంది.

సాయంత్రం చల్లగాలికి వరండాలో నిల్చొని దూరంగా అప్పుడే మినుకుమినుకుమంటున్న లైట్లు కాలవనీటిలో గుచ్చుతున్న వెలుగు తోరణాల్ని గమనిస్తున్నాను.

'నమస్కారమండి'

ఉలిక్కిపడి వెనక్కి తిరిగాను. ఎదురుగా జంగిడీ.

'ఓ జంగిడీ నువ్వా! రా తప్పావే. రావా' ఆనందంగా ఆహ్వానించాను.

'ఈ మధ్య కనిపించటమే మానేసారు! ఇంత తీసుకోండి'

కుచేలుడి అటుకులు జ్ఞాపకం వచ్చాయి. ఆత్రుతగా తిన్నాను. మొదటిరోజు ఆకలి తీర్చిన ఆవడలే. అదే రుచి.

'రెండురోజుల్నుంచి మీ దగ్గరకు రావాలని ప్రయత్నం' జంగిడీ అన్నాడు.

'ఎందుకో?'

'బాంకు లోను కావాలి.'

'నీకా?'

'కాదు. కుప్పస్వామికి.'

రెండురోజుల క్రితం కుప్పస్వామి లోనుకు పెట్టిన ప్రార్థన కాగితం గుర్తుకొచ్చింది.

'దేనికిట?!' అడిగాను.

'వ్యాపారానికి. బస్తర్‌నించి చింతపండు, కుంకుడుకాయలు తెప్పించి అమ్ముతాడట.'

'మంచి వ్యాపారమే.' మనసులో అనుకుని పైకి నవ్వేసాను.

'నవ్వకండి వ్యాపారదక్షత ఉన్నవాడు' నా మనసు జంగిడికి తెల్సిందే కాబట్టి నా నవ్వుకు అర్థం తెల్సుకున్నాడు.

'కుప్పస్వామికెందుకు గాని నీకు లోనిప్పిస్తాను. తీసుకుని ఏదైనా వ్యాపారం చేసుకో.' అన్నాను.

'నాకెందుకండి? ఈ జంగిడీ నా దగ్గరున్నంతకాలం నాకేలోటు లేదు. సంపాదించి నిలవెయ్యాలనే కోర్కె నాకు లేదు.'

ఆరోజు జంగిడీ నన్ను కుప్పస్వామికి లోను ఇచ్చేట్లు ఒప్పించి మరీ ఇల్లు కదిలాడు.

తరవాత చాలాకాలందాకా జంగిడీ నాకు కనిపించలేదు.

* * *

వేసంకాలం.

ఎండలు లోకాన్ని మండించేస్తున్నాయి. అగ్నిప్రమాదాలకి, గృహదహనాలకి జడిసి ప్రజలు ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకుని, కళ్ళల్లో ఒత్తులేసుకుని కాలం నెట్టుకొస్తున్నారు.

ఓ మిట్టమధ్యాహ్నం కబురొచ్చింది జంగిడీ గుడిసెకు నిప్పంటుకుందని.

పరిగెత్తాను.

నే వెళ్ళేసరికి జంగిడీ గుడిసె ఆర్పాలని విఫలయత్నం చేస్తున్నాడు. నేనూ కల్సాను. కాని మంటలు అప్పటికే విజృంభించాయి. ఇంతలో ఒగర్చుకుంటూ కుప్పస్వామి పరిగెత్తుకొచ్చాడు.

'వేలుపిళ్ళై! నన్ను రక్షించు నా పేద అంటుకోటానికి సిద్ధంగా ఉంది. నా పశువులకొట్టు తగలడిపోతుంది. నువ్వు రాకపోతే నా ఆస్తి అంతా మంటకలిసిపోతుంది.'

కుప్పస్వామి జంగిడీ కాళ్ళు చుట్టేసాడు.

'ఏం జరిగింది?' నేనడిగాను.

'మా పక్క వీధిలో రెండు పెంకుటిళ్ళు అంటుకున్నాయి. గాలి బాగా వీస్తోంది. కాసేపట్లో నా పశువుల కొట్టుమేడా అంటుకుంటాయి. పిల్లలు కలవాణ్ణి. ఇద్దరం ఒకే ఊరివాళ్ళం. నన్ను అన్యాయం చెయ్యకు. నువ్వు రాకపోతే నా ఆస్తంతా సర్వనాశనం ఐపోతుంది' కుప్పస్వామి దీనంగా దిగజారిపోయాడు.

జంగిడీ తన గుడిసె కేసి చూసాడు. రక్తపురంగు మంటలు నిలువుటంచుల నాల్కలు జాచి ఆకాశాన్ని మింగాలని ఎగిసిపడుతున్నాయి. వర్రున దూసేగాలి ఎండిన కొబ్బరాకుల్ని మంటకు అందిస్తున్నాది. కాలిన ఆకుముక్కలు గాల్లో ఎగురుతున్నాయి. ఎగిరిన నిప్పురేణువులు పైకి వెళ్ళి నల్లగా మాయమవుతున్నాయి.

'ఒక్క నిమిషం ఉండు.' మాట అంటూనే చటుక్కున కాలుతున్న గుడిసెలోకి దూరి మరుక్షణంలో జంగిడీ చేతో పట్టుకుని బయటకొచ్చాడు వేలుపిళ్ళై.

జంగిడీ నిర్ణయం నా కర్థమైంది దానికి అడ్డుగా నిల్చాను నేను.

'క్షమించండి. నామీద మితిమీరిన అభిమానంచేత శృతిమించిన పరిస్థితిని మీరు గమనించటం లేదు. నేనొంటరివాడిని కాబట్టి నేనేమైనా భయంలేదు. కాని కుప్పస్వామికి, అతని ఆస్తికి ఏమీ కాకూడదు. అతనంటే నాకు మమకారం.



ఆంధ్రప్రదేశ్ శాసనసభ కార్యదర్శి శ్రీ శంకరరెడ్డి జ్యేష్ఠపుత్రిక వి. సా. విజయలక్ష్మికి, పర్గి తాలూకా కొమ్మపల్లి వాస్తవ్యులు శ్రీ ఆర్. అనంతరెడ్డి తృతీయపుత్రుడు వి. తిమ్మారెడ్డికినిచ్చి మే 24 న హైదరాబాదులోని శాసనసభ్యులనూ తన నివసగృహంలో వివాహం జరిగింది. ఈ వివాహానికి రాష్ట్ర గవర్నర్ శ్రీ ఖండూభాయ్‌దేశాయ్‌వచ్చి వధూవరులను ఆశీర్వదిస్తున్న దృశ్యం. (ఫోటో: రహీమ్)

కుప్పస్వామికి నామీద విపరీతమైన నమ్మకం. ఆ నమ్మకం పాడు చెయ్యకండి.' వరిగెట్టాడు వేలుపిళ్ళై. వెనక నడిచాడు కుప్పస్వామి.

జంగిడీ గుడిసె బూడిదైంది.

వేలుపిళ్ళై చేతి చలవవల్ల కుప్పస్వామి ఆస్తి అగ్నిపాలు కాలేదు.

'ఇక నే వెళతా కుప్పస్వామీ' ప్రక్కవీధిలో మంటలు ఆరింతరవాత వెళ్లటానికి సిద్ధపడ్డాడు వేలుపిళ్ళై.

'భలేవాడివే ఎక్కడికి వెళతావ్ ? పాపం గుడిసెకాస్తా అంటుకు పోయింది. భోంచేసి పోదువుగాని కుందాంలే.'

ఆ రాత్రికి వేలుపిళ్ళై కుప్పస్వామి అతిథి అయ్యాడు. మర్నాడు అందంగా అలంకరించుకుని హుందాగా మెట్లు దిగి బయటికి వెళ్లబోతున్న కుప్పస్వామిని హాల్లో మెట్లదగ్గర ఆపి వేలుపిళ్ళై అన్నాడు.

'కుప్పస్వామి ! నాకో వందరూపాయలు అప్పిస్తే గుడిసె వేసుకుంటాను, ఓ మూడు నెలల్లో తీర్చేస్తాను.'

'అప్పేవిటోయ్. కొంచెం ఓపికపట్టు. ఇవాళో రేపో బస్తర్‌నించి సరుకొస్తుంది. రాంగానే ఇల్లే కట్టించేస్తాను. ఈలోగా ఖాళీగా కూర్చోటం నీకిష్టం ఉండదు కాబట్టి వంతపండు కొట్లో నాకు సాయంగా వుందువుగాని.'

రెండురోజులు గడిచాయి. కుప్పస్వామి

# జంగిడీ

దర్శనమే గగనమై పోయింది వేలుపిళ్ళైకి. ఇంట్లో అందరూ తినగా మిగిలిన అన్నం, కొట్లో ఎవరూ చెయ్యలేక వదిలేసినపన్లు వేలుపిళ్ళై వంతయ్యాయి.

మర్నాడు సాయంత్రం తను వెళ్లిపోవటం గురించి ప్రస్తావించాడు పిళ్ళై స్వామితో.

'నీ కిక్కడేం లోటు జరుగుతుందయ్యా? పిల్లాపీచులేరు. జాత్ర మిత్రుడివి. నాతో పాటు ఉండిపోటానికి నీ కభ్యంతర మేంటి?' తన మనసులో మాట బయటపెట్టాడు కుప్పస్వామి.

ఈ మాట పాపం అమ్మేసినపుడు అని ఉంటే వేలుపిళ్ళై కథ మరోరకంగా ఉండేది. అదికాక స్వేచ్ఛగా ఎగిరే పక్షిని పంజరంలో ఉంచి కోరినది ఇచ్చి పెంచితే ప్రాణాలకు ముప్పుండదు కాబట్టి ఆయుష్షంతా ఐనా పెరుగుతుంది. కాని దాని స్వేచ్ఛను గుర్తుచేసి ఎగిరే రెక్కలను తెగేయాలనుకుంటే అది నిమిషంకూడా శాంతిగా మనలేదు.

'క్షమించు కుప్పస్వామి. నీ మాట పాటించలేను. నేనిప్పుడే వెళ్లిపోతాను. ఇవ్వగలిగితే గుడిసె వేసుకునేందుకు డబ్బు అప్పుగా ఇయ్యి.' వేలుపిళ్ళై ఖచ్చితంగా చెప్పేశాడు.

'నీకు తెలియందేముంది ? బస్తర్‌నించి ఇంకా సరుకు రాలేదుగా !' కుప్పస్వామి కూడా తేల్చేశాడు.

'సరే. మొన్న గుడిసె తగలడి పోయినపుడు నా వెదురు జంగిడీ ఒకటే బయటకు తెచ్చుకున్నాను, లోపల దాచాను. అది ఇస్తే వెళ్లిపోతాను.'

'జంగిడీనా ? అరెరే అది నీదా ? ఎంత పని జరిగింది. అసలు ఈ పాలేరు వెధవలకి బొత్తిగా బుద్ధుండదోయ్ పిళ్ళై.' చాలా నొచ్చుకుంటూ అన్నాడు కుప్పస్వామి. వేలుపిళ్ళైకి ఏమీ అర్థంకాలేదు. విషయం ఏమిటన్నట్లు కుప్పస్వామి వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

'ఏంలేదోయ్. నిన్న ఊకవలు బుట్ట కనిపించలేదుట. పశువులు ఆకలితో గోల చేస్తున్నాయి. సమయానికి నీ జంగిడీ అన్నావే అది కనిపించిందట, అప్పటికి. తరవాత అడిగాను 'మరచేనటాను.' నన్ను నమ్ము పిళ్ళై. ఆ క్షణంకి జంగిడీ నీదేనని గుర్తు రాలేదు.'

'పోన్లే కుప్పస్వామి.'

'నీ హృదయం నాకు తెల్సు పిళ్ళై. పాపం జంగిడీ లేకపోతే నీకు బాధ కదూ? నిన్ను బాధపెట్టటం నాకిష్టమా ? తప్పు జరిగిందానికే నేను చాలా సిగ్గుపడుతున్నాను. ఓ పనిచెయ్యి. ఎవరిదగ్గరైనా ఓ ఐదు రూపాయలు అప్పు తీసుకుని జంగిడీ కొనుక్కో. బస్తర్‌నించి సరుకు రాంగానే ఇస్తాను. అప్పుగా కాదులే ఏం ?'

వేలుపిళ్ళై తలెత్తి ఎదురుగా ఉన్న మనిషిని చూట్టానికి సిగ్గుపడ్డాడు. ఏడుపొచ్చినా ఏడవలేదు. గుడ్లనించి నీరు వడే కన్నీటిని వెక్కి కుక్కుకుంటూ బయటకు నడిచాడు.

* * *

కుప్పస్వామి తను ఇన్‌స్టాల్‌మెంటు కట్టటానికి బాంకుకు వచ్చి పిళ్ళై తన మాటని కాదని వెళ్లిపోయిన వైనం నాకు చెప్పినది నా మాటల్లో చెప్పటంకంటే అతని మాటల్లో ఉన్నదున్నట్లు చెబితేనే ఈ కథకు అందం.

'నేనలా చెప్పి చూశానండీ వినలేదు. ఆగవయ్యా బస్తర్‌నించి సరుకొస్తుంది. రాంగానే డబ్బు ఇస్తాను ఇల్లేసుకుందువుగాని అన్నాను. వినలేదు. పోనీ ఎక్కడో ఊరిచివర ఒంటరిగా ఎందుకు ఇంత



చారూ అన్నం నాతోటె తిని నా వ్యాపారాన్ని చూడవయ్యా అని అడిగాను. వింటేనా ? లేదు మా బ్రతుకు తక్కువ సాలేరుగాదు నీ జంగిడీ ఉలవలకి పెట్టి పాడుచేసావు, నీ బతుకు నువ్వే బతుకుదువుగాని కొత్త జంగిడీ కొనుక్కో, డబ్బు ఇస్తాను అన్నా. వినిపించుకోలేదు. ఇన్నిమాట లెందుకండీ ! విప్పుడు నామాట విన్నాడు గనకనా ? అప్పుడు హోటలు పేరానికి పెట్టు వపుడూ లేదు. గుడిసె తగలబడి పోయిం తర్వాత ఇప్పుడూ లేదు. దురదృష్ట వంతుల్ని బాగుచేసేవారు, అదృష్ట వంతుల్ని చెరిసేవారు వేరే ఎవ్వరూ ఉండరు. ఏదైనా వాళ్ళ స్వహస్తాలతో చేసుకుంటూరు. ఏమంటూరు ?'

నేను మొరిగే కుక్కలతోటి, తన్నే గాడిదలతోటి, గోతులుతీసే మనుషులతోటి మాట్లాడను, అందుకే కుప్పస్వామి చెప్పిందంతా మౌనంగా విని మూగగా ఉండిపోయాను!

* * *

వేసవి ఉధృతం ఇంకా తగ్గుబడలేదు నెత్తి మీద ఎండ చురచుర మంటుంది. 'లంచ్' రీసెస్‌లో 'టిఫెను' తిని మధ్యాన్నం డ్యూటికి బయలుదేరాను. అయిదు నిము షాలు కాలేదు చల్లటి నీరుతాగి. అప్పుడే దాహం వేపుకు తింటోంది. సుక్కా లిక్విడేదైనా నోటికి అందిస్తే గాని తడారి పోతున్న పెదాలు పొడిగా వెలగవు. రోడ్డు టర్నింగులో సోడాబండి ఉంది. త్వరగ అడుగులేసాను.

'సోడాసార్, చల్లని సోడా.'

ఎదురుగా సోడా బండిలో జంగిడీ

'జంగిడీ ! నువ్వా ?'

'అవున్సార్. నాపేరిప్పుడు జంగిడీ కాదు. సోడా. నిన్నటినించే మొదలు పెట్టాను.'

'నీపని నాకేం నచ్చలేదు...అవకాశాలు అందుబాటులో ఉన్నా కొందరు అందు కోరు.' జంగిడీతలెత్తాడు. అతని కనుకొలకు ల్లో రాలి పడటానికి రెడీగా ఉన్న కన్నీరు '

అతని మమకారం నా ప్రతి అణువుని కదిల్చి వేసింది. అతన్ని అర్థం చేసుకో టానికి పిచ్చిగా అతనివంక చూసాను.

'వేడివడ లేకపోతేనేంసార్ ! చల్లటి సోడా తాగండి. దాహం తగ్గుతుంది.' ఆప్యాయంగా అన్నాడు. ఎంత వెతికినా ఆ గొంతులో వ్యాపారసరళి ధ్వనించలేదు. సిన్సియారిటీ ప్రతిధ్వనిస్తోంది.

నేను పెరిగాను. జీవితంలో బాగా ఎదిగాను. వసంతాలు వెడుతున్నాయి. ఋతువులు గడుస్తున్నాయి. ప్రపంచం వేగంగా అభివృద్ధి చెందుతోంది. మరలు మనుషుల్లా పని చేస్తున్నాయి. మనుషులు మరల్లా మారుతున్నారు. ఊహించని మార్పు లొస్తున్నాయి. కాని ఆనాటి ఆ జంగిడీ నేటికీ ఆనాటి లాగే ఉన్నాడు.

ఐనజ్ మూవ్‌డ్!'

ఆత్రంగా అతనిచ్చిన అమృతం చుక్క మిగలకుండా తాగేసాను.

ఇంతలో నా ప్రక్కనే ఓరిక్షా ఆగింది: 'ఏయ్ సోడా ! ఓటి ఇలాపట్టా' రిక్షా అడిగింది. సోడా ఓపెనరు బాటిలు తీసు కెళ్ళాడు జంగిడీ.

'ఓ పిళ్ళైనువ్వా ? ఎవరో అను కున్నాను. సోడా అమ్ముతున్నావన్నమాట. గుడ్ బాగుంది. నీకు నచ్చినవృత్తి చేపట్టావు. భేష్.' కుప్పస్వామి రిక్షా లోంచి దిగకుండానే సోడాబుడ్డి ఖాళీచేసి ఇచ్చాడు. తృప్తిగా కారుహోరనులా త్రేన్చాడు.

'అంతా బావున్నారా కుప్పస్వామి పిల్లలూ వాళ్ళూ' వేలుపిళ్ళై అడుగు తున్నాడు.

'ఆ. ఆ. ఆ. అంతా బాగానే ఉన్నారు. నువ్వు చాలాకాలమైంది కదూ మా ఇంటి కొచ్చి. సాయంకాలం అలా ఓసారిరా. సిలెండర్ల బిజినెస్ చేద్దా మనుకుంటు న్నాను...అన్నట్టు నా దగ్గర చిల్లర ఉన్నట్టులేదు. సాయంకాలం అలా ఇంటి కొస్తావుగా. అప్పుడు ఆ డబ్బు పైసలూ ఇచ్చేస్తాను. వస్తా.'

కుప్పస్వామి రథం కదిలింది. ●




ఆర్. సుధ, వెంకటాపురం.

నా వయస్సు 18 సం. లు. నాకు 2 సం. ల వయస్సప్పుడు ఎడమకాలుకు పక్షవాతం వచ్చింది. ఇప్పుడు ఎక్కువ దూరం నడిస్తే కాళ్ళు నెప్పులుగాను, మడమ భాగంలో నెప్పిగాను వుంటోంది.

* పక్షవాతం వచ్చిన తర్వాత కండరములు ఎక్కువగా స్వాధీనంలో వుండవు. పక్షవాతం రాగానే, వెంటనే ఆయా భాగాలకు తగిన ఎక్సర్‌సైజు చేయాలి. అలా చేయక వదిలిపెట్టినప్పుడు కండరములు చిన్నవయి, మామూలుకన్నా తక్కువ పొడవుగా వుంటాయి. ఆ కండరములను వుపయోగించవలసి వచ్చినప్పుడు, నెప్పి, అలసట కలుగుతాయి.

మీకు ఇప్పటికైనా ఫిజియో తెరపీ అవసరం.

ఎం. ఎస్. మిత్ర—నెరబైలు (చిత్తూరు)

మా పాపకు 5 నెలల వయస్సు. ఇంత వరకూ వాక్సినేషన్ చేయించలేదు. ఇంత వరకూ రెండుసార్లు ట్రిపుల్ ఆంటిజన్ వేయించాము. దీనితోబాటుగా 'పోలియో' డ్రాప్స్ వేయించ వచ్చునా?

* మామూలుగా, మొట్టమొదట వాక్సినేషన్ చేయించి, ఒకనెల తర్వాత, ట్రిపుల్ ఆంటిజన్ వేయించాలి. దీనిని నెలకొక మారుగా మూడుసార్లు వేయించాలి. ఈ ఇంజక్షన్లు వేసే సమయంలోనే 'పోలియో' డ్రాప్స్‌కూడా వేయించ వచ్చును. ఈ డ్రాప్స్ ఆరువారాల కొకసారిగా మూడు తడవలు వేయించాలి.

రెండవ సంవత్సరము చివరిలో ఒక ట్రిపుల్ ఆంటిజన్ ఇంజక్షను, ఒకసారి మాత్రము పోలియో డ్రాప్స్ వేయించాలి. పిల్లలు స్కూలుకు వెళ్లేముందు—సుమారుగా 5 సం. లో ఇంకొక ఇంజెక్షను (ట్రిపుల్ ఆంటిజన్) వేయించాలి.

పి. పూర్ణచంద్రరావు, సిర్‌పూర్ కాగజ్ నగర్

వడదెబ్బ కొట్టినప్పుడు, రోగికి వుండే లక్షణాలు ఏమిటి?

* వడదెబ్బకొట్టడం, వాతావరణంలోని వుష్ణోగ్రత, మనిషి శరీరంలోని నీరు—లవణములకొరత, పరిమాణము, శరీరంలో ఇతర రోగాలు మున్నగువాటిమీద ఆధారపడి వుంటుంది.

ఇతర రోగాలవల్ల నీరసంగా వున్నప్పుడు, ఎండతీవ్రత ఎక్కువగా వున్నప్పుడు, సోడియం, పొటాషియం, క్లోరైడ్ మొదలగునవి రక్తములో తగ్గినప్పుడు — కళ్ళు తిరగటం, కళ్ళు లోతుకు పోవటం, నాలుక ఎండిపోవటం, మైకము, చివరికి స్పృహ తప్పటం జరుగుతుంది. ఇలా వచ్చినవారికి గతవారంలో చెప్పినట్లు చికిత్స చేయించాలి. గ్లూకోస్, సలైన్, మజ్జిగ, పళ్ళరసం ముఖ్యం.

షేక్‌మక్బూల్, బెల్గాం

మా బావమరిదికి 6 సం.ల క్రితం మశూచి వచ్చినతర్వాత కుడివైపు తొడ రానురాను సన్నబడటం మొదలయింది. ప్రస్తుతం వారు నడవలేని స్థితిలో వున్నారు.

* మశూచి వచ్చిన కొందరికి ఎముకలకు చీము పట్టడం జరుగుతుంది. దీనిని 'ఆస్టియో మైలైటిస్' అంటారు. ఇలా చీముపట్టిన ఎముక కొన్నాళ్ళకు, జీవం లేకపోవటంవల్ల వుపయోగకరంగా వుండదు. మొట్టమొదట కనిపెట్టినప్పుడే మంచి వైద్యము చేయిస్తే రోగం నయమయ్యేది. ఇన్ని సం.ల తర్వాత వైద్యం చేయటం కష్టమే అయినా, వున్నంతలో కొద్ది కొద్దిగా వ్యాయామము చేయించటం మంచిది. 'ఆర్థోపెడిక్' వైద్యులను సంప్రదించండి.

ఆర్. జానకి, అమలాపురం

1 సం.గా నాకు కాళ్ళు, చేతులు పోట్లుగా వుంటున్నాయి. పోట్లు వచ్చే ముందు, జబ్బదగ్గరనుంచి వేళ్ళవరకు చల్లబడుతుంది.

* ఇలా రావటం, రక్తనాళములు నొక్కుడు పడటంవల్ల (సెర్వైకల్ రిబ్ మొదలగువాటివల్ల), సింపతెటిక్ నెర్వస్ సిస్టమ్ ఎక్కువగా పనిచేయటంవల్ల, నరాల బలహీనతవల్ల జరుగుతుంది. బి1, బి6, బి12, ఇంజక్షన్లు వాడండి. బెరిన్ మాత్రలు క్రమంగా వాడాలి. మూత్రపరీక్ష చేయించుకోవటం అవసరం. అలాగే మెడ భాగాన్ని 'ఎక్స్‌రే' తీయించి డాక్టర్లకి చూపించండి.

బి. సంజీవరెడ్డి, కొల్లిపర

మా పాపకు 3 సం.ల వయస్సు. కొద్దిగా దెబ్బ తగిలినా, క్రింద పడినా 3 నిముషములవరకూ వూపిరి తిప్పుకోలేదు, తెల్లగుడ్లువేసి నల్లబడుతుంది.

* ఈ రోగాన్ని 'బ్రెత్‌హోల్డింగ్ స్పెల్స్' అంటారు. ఈ రోగం మానసిక ఆందోళనను తెలియజేస్తుంది. దీనినే మనలో కొందరు చిన్న బిడ్డ గుణం అని కూడా అంటారు. ఈ రోగానికి ఎక్కువగా శ్రద్ధ చూపనక్కరలేదు. 6 సం.ల వయస్సు వచ్చేలోపల తగ్గిపోతుంది. పిల్లలని బిగర వేయటం మున్నగునవి అనవసరం. కొంచెం సేపటికల్లా మామూలుగా అవకలుగుతారు. దెబ్బలు తగలకుండా చూసుకోవటం, పిల్లల దృష్టి ఆటలమీదికి మళ్ళించటం, పిల్లలకి మానసిక వ్యధ రాకుండా చూసుకోవటం ఇలా తరచూ రాకుండా తీసుకోతగిన జాగ్రత్తలు.




# బంగారుపళ్ళు

మధురాంతకం రాజారాం

ఉద్యోగిని తరచుగా విదుంబ్రైనే సమస్య పెండింగ్ ఫైలు. ఏ ముహూర్తాన్నో వో కాగితం చేతికందుతుంది. దానిపైన సముచితమైన చర్య తీసుకోవలసిందని ఆఫీసరు హెచ్చరిస్తారు. ఆ సముచితమైన చర్య ఏమిటో ఉద్యోగికి బోధపడదు. ఒకవేళ బోధపడిందనుకోండి! ఆ చర్యను అమల్లో పెట్టడానికి వీలేని పరిస్థితులు ఉదపురిస్తాయి. కొన్ని కొన్ని సందర్భాల్లో ఒక్కొక్క ఫైలు నెలల తరబడీ. సంవత్సరాల తరబడీ గూడా పెండింగులో వుండి పోతుంది.

అడ్వొకేటు సత్యారావు కథ నా పాలిటి కలా ఒక పెండింగు ఫైలుగా వుండి పోయింది. మధ్యమధ్యలో విన్నో రిమైండర్లు. వచ్చిన చిక్కేమిటంటే దీన్ని క్లోస్ చెయ్యడానికి నా ఊహాగానాలేవీ పనికిరావు. పనిగట్టుకుని కొంత శ్రమకు లోనుగావాలి. మొదట సత్యారావు స్టేటుమెంటులోని నిజానిజాలను పరిశీలించాలి. పరిశీలించాలంటే అతడితో నాకు కాస్త సాన్నిహిత్యం వుండడం అవసరం. నాకూ, సత్యారావుకూ మధ్యలేని సంబంధం అదే! సత్యారావు నాకు పరిచితుడుగాడు. కనీసం మా వూరివాడైనా కాడు. అరవై మైళ్ళు బస్సులో ప్రయాణంచేసిన తర్వాతమాత్రమే వేషతణ్ణి దర్శించగలగడం సాధ్యవౌతుంది.

ఇంతకూ సత్యారావన్న మాటేమిటో తమకు మనవి చెయ్యాలి. దాదాపు వెయ్యిమంది శ్రోతల్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ సత్యారావు ఆ మాటన్నాడు. నాటికీ నేటికీ నా మట్టుకు నేను మాత్రం ఉదెంతో సహానంతో ... కూడుకున్నమాటగానే భావిస్తూ

న్నాను ఉద్యోకేటుగదా! వృత్తిధర్మానికి అనుగుణ్యమైన వాక్చాతుర్యంతో అతడు వీలయినంత సహజంగా, అవసరమైనంత వినయపూర్వకంగా తన స్టేట్‌మెంటును బయటపెట్టాడని గూడా ఒప్పుకుంటాను.

'అయ్యలారా! అన్యథా భావించకపోతే నేనొకమాట చెప్పాలి. దయచేసి అతిశయోక్తి అనుకోకండి! ఆత్మస్తుతిగా భావించకండి. మాది అన్యోన్యదాంపత్యమనీ, మేము ఆదర్శదంపతులమనీ మమ్మల్ని తెలిసినవాళ్ళందరూ అనుకుంటూరు. అదే నా విశ్వాసంగూడా!' అన్నాడు సత్యారావు.

నిజం చెప్పొద్దూ! 'ఓరి పిట్టపిడుగా!' అనుకున్నాను.

ఎందుకంటూరా! నాకు అన్యోన్య దాంపత్యంపైన ఏమంత నమ్మకంలేదు. ఇంటింటికీ 'ఒక జంటను చూస్తున్నాం. దేవుడు దయదలిస్తే ఒకే యింట్లో రెండుమూడు జంటలుగూడా! మచ్చుకు మనకు బాగా ఎరుకలోవున్న పదిపన్నెండు కాపురాల్ని పరిశీలించినా సరే అన్యోన్య దాంపత్యమనేది వట్టి నేతిబీరకాయ చందమని తేలిపోతుంది. భార్యాభర్తల్లో ఒకరు తోడేలయితే, యింకొకరు మేకపిల్లలావుండే ఉదంతాలనేకం! కొన్నిచోట్ల ఆలుమగల్లో ఒకరు నిప్పయితే యింకొకరు ఉప్పు. పైకి చూడ్డానికి కొన్ని కాపురాల్లో సామరస్యం నెలకొని వున్నట్టే తోస్తుంది. కానీ లోపల్లోపల ఎన్నో లొసుగులుంటాయి. వుక్కోటి కథలో రేచుక్క, పగటిచుక్కలకు మల్లే కొందరు భార్యాభర్తలకు బ్రతుకంతా ఎత్తుకు పైయెత్తు వేయడంతోనే సరిపోతుంది. పతినే దైవంగా భావించే పతివ్రతల చిత్తశుద్ధిపట్ల నాకు నమ్మకం చాలా తక్కువ. ఎంతటి తప్పుచేసినా మన్నించగలిగినవాడే దేవుడు. మామూలు మనిషికి అంతటి ఔదార్యము, ఔన్నత్యము, వుంటాయనుకోడం భ్రమ. మగవాణ్ణి అలా ఉబ్బించడానికి వెనుక భార్యకు స్వప్రయోజనాలను నెరవేర్చుకునే ఆకాంక్ష వుంటుందని నా అనుమానం. పోతే భర్త తిట్టినా, కొట్టినా మారుమాటాడకుండా వూరుకునే ఆడవాళ్ళను ఎందుకు గౌరవించాలో నాకు బోధపడదు. జీవచ్ఛవాలకు వాళ్ళకూ తేడా ఏమిటో తెలుసుకోవాలనిపిస్తుంది. ఇందులో మగవాళ్ళు నెలతక్కువగా పుట్టిందేమీలేదు.

# బంగారుపొయ్యి

వాళ్ళల్లో పతివ్రతలున్నట్టే, వీళ్ళల్లోనూ భార్యా విధేయులుంటారు. ఇంకొక మెట్టు పైకివెళ్ళి భార్యల్ని ఆరాధించే వాళ్ళ మాటేమిటంటారు? తన భార్యను తానొక దేవతగా చూసుకుంటాననే వ్యక్తిని నేను స్వయంగా ఎరుగుదును. మొదటితరగతి ఆడకైదీకి మగ కాపలాదారుకన్నా అతడి వ్యవహారం ఏమంత మెరుగ్గాలేదు.

ఇలా అన్ని యిళ్ళల్లోనూ మట్టిపొయ్యే వున్నట్టు ఋజువవుతుంటే తనయింట్లో బంగారుపొయ్యి వుందన్నాడు సత్యారావు!

అసలీ బంగారు పొయ్యి ప్రస్తావన ఏ సందర్భంలో వచ్చిందో చెప్పాలి. రెండేళ్ళ క్రిందటి సంగతి. ఏదో పనిమీద జిల్లా ముఖ్యపట్టణానికి వెళ్ళాను. వెళ్ళినపని మరునాటికి వాయిదా పడింది. వెళ్ళినరోజు సాయంకాలం ఏం చేయడానికి పాలుపోక షికారుగా రాజవీధిగుండా నడచిపోతున్నాను. ఒకచోట కిటకిట లాడిపోతున్న జనసమూహం నాకు అడ్డొచ్చింది. ఐతే వాళ్ళు నాకెదురుగా రావడంలేదు. రోడ్డు కడ్డంగా ఎక్కడికక్కడ ఒక తటాకంలా నిలబడిపోయి వున్నారు. జనాన్ని చూచే సరికి కాలక్షేపానికి అనువుగా అక్కడేదైనా విశేషం జరుగుతూ వుండొచ్చుననే అనుకున్నాను. దగ్గరికి వెళ్ళాక తెలిసింది. పురమందిరంలో జరుగుతువ్నది సన్మానసభ. హాలు నిండిపోయి, వసారా నిండిపోయి, సోపాన పంక్తుల దగ్గరినుంచీ రోడ్డు అంచులదాకా శ్రోతలు విస్తరించి వున్నారు. సన్మానసభకు యింతమంది రావడం అపూర్వమే! ఒక్కటే ఎక్సెప్షన్: సినిమాతారలకు జరిగే సన్మానం. సినీతారల తర్వాత అంతటి గ్లామర్ మంత్రుల కుండడం చూస్తున్నాం. ఇక్కడ సన్మానితుడు మంత్రికాడు సరిగదా, మంత్రులచుట్టూ తిరిగేవాడైనా కాడు. సినీ నటుడు కాకపోతే మానె, సినిమా రచయితైనా కాదు. ప్రఖ్యాత ప్రజాకవి దయానిధిగారికి సన్మానమని నల్లబల్లపైన ప్రకటన కనిపించే సరికి తెల్లబోయాను.

దయానిధిగారితో నాకు వ్యక్తిగత పరిచయం లేకపోయినా ఆయన వ్యక్తిత్వం గురించి కొన్ని వివరాలు తెలుసు. ఏహో నాలుగైదు రకాల ఉద్యోగాలుచేసి, పై అధికారులతో అభిప్రాయభేదం రావడంవల్ల ఆయన అన్నింటికీ ఉద్వాసన చెప్పేశాడు. ఎన్నికల ప్రచారానికి పనికొచ్చే రచనలు చేయడానికి నిరాకరించి పెద్దలతో విరోధం కొనితెచ్చుకున్నాడు. దేశంలో పత్రికలంటూ కొన్ని వున్నాయి గనుక ఆయన రచనలు వెలుగులోకి వచ్చే అవకాశం కలిగింది. 'ఇదిగో తీసుకోవయ్యా! ఈ పదికాసులు నీ ఖర్చుకు వాడుకో!' అని చెప్పలేని శ్రీరామచంద్రుణ్ణి నమ్ముకున్న పోతన్నగారి తర్వాత అంతటి పిచ్చివాడెవడంటే దయానిధిగారేనని చెప్పాలి. అన్నట్టు ఈయన చేస్తున్నది గూడా వ్యవసాయమే! రెండెకరాల మడిపైన వచ్చే గింజలు తిండికి సరిపోయేటట్టున్నాయి. ఆ పొలం మధ్యనే చిన్న డాబా ఒకటి వేసుకున్నాడట! అందులో సగం మేరకు లైబ్రరీయేనట! ఆ లైబ్రరీయే ఈయన సామ్రాజ్యం. సామ్రాజ్యాధీశుడికోసం సామంత ప్రభువులు రావడం పరిపాటి. ఈ సారస్వత సామ్రాజ్యాధిపతికోసం పెరకమహాశయుల్లో ఒకరు గాకపోతే ఒకరు మునగాలపాడుకు వెళుతుంటారట! వెళ్ళినవారికల్లా గోంగూర పచ్చడితో, ఆవకాయతో, గేదె పెరుగుతో కమ్మటి భోజనం. ఆపైన సాహిత్య సమారాధనం. కమ్మటి భోజనం సుఖమా? దయానిధిగారి సన్నిధిలో సాహిత్యోపాసన సుఖమా? ఏమో, త్యాగయ్యగారిలాంటి సాధకుణ్ణి అడగాలి.

జనంలో చొచ్చుకుంటూ పురమందిరం ఎదుటకు వెళ్ళి నిల్చునేసరికి మైకులో నుంచీ ఎవరిదో ప్రసంగం వినిపిస్తోంది. —'దయానిధిగారిని గురించి ఎందరో పెద్దలు యిదివరకే ప్రసంగించి వున్నారు. మనం విన్నాం. కొత్తగా చెప్పడానికి నాకు మిగిలిందేమీ లేదు. దయానిధిగారి కవిత్వమన్న సూర్యుణ్ణి చూపించడానికి నేను దివిటీ తెచ్చుకోలేదు. కానీ ఆయనపట్ల నాదొక బాధ్యత వుంది. అదేమిటంటే కృతజ్ఞత చెల్లించడం! మేలు చేసినవాళ్ళకు కృతజ్ఞత చెప్పడం సాంప్రదాయం. ఈ విషయంలో నేను చాలా ఆలస్యం చేశాను. అయినా సరైన సమయంలో, సరైన సందర్భంలో ఈ మాట చెప్పకోగలుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా

వారిది. వృత్తిరీత్యా నేను అడ్వకేటుని! కానీ లాయరని అనిపించుకోడంకన్నా కవి ననిపించుకోవాలన్న కోరిక నాలో ప్రబలంగా వుండేది. అప్పట్లో దయానిధిగారు వున్నంతలో ప్రోత్సహించారు. వారికి చదివి వినిపించి, వారి సూచన మేరకు సవరింప బడిన తర్వాత నా కవిత్వం శంఖులోపోసిన తీర్థంలా ఆస్వాదనీయంగా వుంటూ వచ్చింది. కాని నారాయణకు కృతజ్ఞత చెప్ప దలచుకున్నది యిందుకుగాదు. ఆయన నాకు చేసిన మహోపకారం యింకొక టుంది. అదేమిటంటే...

మాట్లాడుతున్న వ్యక్తి ఏ కారణం వల్లనో కొద్ది క్షణాల విరామం యిచ్చాడు.

ఆ విరామంలో వక్తని గురించి వాకబు చేశాను. పేరు సత్యారావనీ, వూరు పలమనేరనీ తెలియవచ్చింది.

'ఏమిటంటే...'—సత్యారావు ప్రసంగం కొనసాగిస్తున్నాడు— 'పెళ్ళిళ్ళు స్వర్గంలో చేయబడతాయంటూ ఒక సామెత వుంది. అదెంతవరకూ నిజమో నాకు తెలియదు. నా పెళ్ళి మాత్రం తిరువానూరు సత్రంలో జరిగింది. పెళ్ళయ్యాక యింటికి తిరిగి వచ్చాము. పోస్ట్‌మేన్ ఒకవరు తీసుకొచ్చి యిచ్చాడు. దయానిధిగారి దస్తూరీ నాకు బాగా గుర్తే. కవరువిప్పి చూద్దును గదా, అందులో ఓ కవరింగ్ లెటరుతో బాటుగా యింకొక చిన్నకవరు కనిపించింది. గబగబా ఉత్తరం చదువుకున్నాను. 'ప్రియమైన సత్యారావూ! నీ పెళ్ళికి నేను రాలేకపోయాను. అన్యథా భావించవద్దు. నా శుభాకాంక్షలు మీ కెప్పుడూ వుంటాయి. ఈ శుభసమయంలో మీ కెన్ని అమూల్యమైన కానుకలైనా యివ్వాలనే వుంది. ఉండి ఏం లాభం? ఇందులోని చిన్న కవరును మర్నాడే విప్పవద్దు. తొలినాటిరేయి మీరు భార్యాభర్తలిద్దరూ దీన్ని విప్పి చదువుకోవలసింది. నేను మీ కివ్వగలిగిందల్లా ఒక చిన్నసలహా...' అంటూ చిట్టచివర సంతకంతో ఉత్తరం పూర్తయింది. మేష్టారుగారి మాట శిరోధార్యం. ఆయన చెప్పినట్లే తొలినాటిరేయి ఆ కవరు విప్పి చదువుకున్నాం. అందులోని సలహా మేరకు నడచుకోవాలని ప్రతిజ్ఞ తీసుకున్నాం. అయ్యలారా! అన్యథా భావించకపోతే నేనొక మాట చెప్పాలి. దయచేసి అతిశయోక్తి అనుకోకండి. ఆత్మస్తుతిగా భావించకండి. మాది అన్యోన్యదాంపత్యమనీ, మేము ఆదర్శ దంపతులమనీ మమ్మల్ని తెలిసినవాళ్ళందరూ అనుకుంటారు. అదే నా విశ్వాసం కూడా!'

సన్మానసభ యింకా జరుగుతుండగానే నేను ముందుకు సాగిపోయాను. నిజానికి సత్యారావు మాటలు అప్పటికప్పుడు నాపైన చూపిన ప్రభావం తక్కువే! కానీ మననం చేసినకొద్దీ మహిమ హెచ్చిన మంత్రంలా కాలక్రమాన అదొక తీరని జిజ్ఞాసగా పరిణమించింది. దయానిధిగారు సత్యారావుకిచ్చిన సలహా ఏమై వుంటుంది?

# బంగారుపొయ్యి

ఆనందప్రదమైన సాంసారిక జీవనానికి నికరమైన దారిచూపే సలహాలో దాన్ని గుప్తంగా వుంచుకోడం అన్యాయం. గోపురంపైన కూర్చుని రామానుజుడు వేదార్థాలు వర్ణించినట్లుగా ఈ రహస్యాన్ని బాకాలుపెట్టి దశదిశలకూ ప్రచారం చేయవలసిన అవసరం ఎంతయినా వుంది. అవకాశం దొరికితే ఈ సత్కార్య నిర్వహణను నేనొక మహాభాగ్యంగా భావిస్తాను.

కానీ ఆ రహస్యాన్ని తెలుసుకోడం ఎలా?

ఆ ప్రశ్నకు సమాధానం స్ఫురించకుండానే రెండేళ్ళు దొర్లిపోయాయి.

## టోమాటో మహాష్

| కావలసినవి | కొలతలు (ఎనిమిది మందికి.) |
|---|---|
| టొమాటోలు (ఒకే సైజు దోరకాయలు) | 500 గ్రా. |
| ఉల్లిపాయలు | 100 గ్రా. |
| పెసరపప్పు | 100 గ్రా. |
| పచ్చి మిర్చి | 2 కాయలు. |
| బంగాళాదుంప | 225 గ్రా. |
| డాల్డా | 50 గ్రా. |
| ఉప్పు | సరిపడినంత. |
| శనగపిండి | 15 గ్రా. |

టొమాటోలు మూచిక దగ్గర కోసి, లోపలి గుజ్జు తీసివేయాలి. ఉప్పు చల్లి తల్లక్రిందులుగా పెట్టాలి. పప్పు బంగాళదుంప వుడికించి కలియనుద్దాలి. ఉల్లిపాయలు పచ్చి మిర్చి తరుగుకోవాలి. డాల్డాలో ఉల్లిపాయ వేయించుకోవాలి. పప్పు, బంగాళాదుంప, ఉల్లిపాయలు, పచ్చిమిర్చి ముక్కలు, ఉప్పు వేసి కలపాలి. చల్లారిన ఈ మిశ్రమాన్ని టొమాటోల్లో కూరాలి. కూరిన యీ టొమాటోలు మూతబెట్టి, శనగపిండితో సీల్ చెయ్యాలి. డాల్డా కాగనిచ్చి, మూతబెట్టిన వైపు ముందు వేయించి, ఎర్రగా కాలినప్పుడు తిరగవేసి పూర్తిగా వేగనివ్వాలి. టొమాటో మెత్తబడేదాకా మూతబెట్టి, ఉడకనివ్వాలి.

— కూ. రా.

మొన్నటికి మొన్న వేరే పనిమీద పలమనేరు వెళ్ళవలసి వచ్చింది. పనిలో పనిగా సంసారాల్లో శాంతినీ, కాంతినీ వెలయించజేసే ఆ గోప్య చిట్కానుగూడా తెలుసుకురావాలన్న దృఢ నిర్ణయంతోనే బయలుదేరాను.

నేనా వూరికి వెళ్ళినరోజు శనివారం. మరునాటి వుదయం సత్యారావు యింటిని వెదుక్కుంటూ బయల్దేరాను. అది తాలూకా కేంద్రం. అక్కడున్న పదిపన్నెండుమంది లాయర్లలోనూ సత్యారావు కాస్త లెక్కకొచ్చిన వాడిలాగనే కనిపించాడు. చింత చిన్న పసిపిల్లవాడైనా సత్యారావు యింటికి సరైన రెక్కమానుగానే వ్యవహరించాడు. కాంపౌండువాల్ దాటుకోగానే చిన్న పూలతోట. పూలతోట మధ్యగా సిమెంటుబాట. ఆబాట వసారాదగ్గర ఆగిపోతుంది. వసారా గుమ్మం హాల్లోకి తెరుచుకుంటుంది. హాల్లోనుంచి వంటగదిలోకి, బాత్‌రూములోకీ, పెరట్లోకి గుమ్మాలున్నాయి. పొందికగా, ముచ్చటైన యిల్లే కట్టుకున్నాడు సత్యారావు. వసారాలో నిలబడి మనిషి పిలకువను సూచించడంకోసం గొంతు సవరించుకోగానే 'ఎవరూ, వివతూ' అంటూ ఓ మనిషి బయటికి వచ్చాడు. 'అడ్వొకేటుగారున్నారా?' అన్నాను. వెయిటింగురూము తలుపుతెరుస్తూ అతడు 'వస్తారు కూచోండి' అన్నాడు.

అసలింతకూ సత్యారావును సందించడానికి సిద్ధపడిన తర్వాత అందుకొక కారణం తయారుచేసుకోవాలిగదా! దారి పొడుగునా అదే ఆలోచనలో వున్నాను. ఆ కారణం నా ప్రయోజనం నెరవేరడానికి ఉపకరించడం ముఖ్యం. కథకుణ్ణిగా కంటే క్లయింటుగానే నేను సత్యారావును కదపగలనేమో! అందుకని నేనొక కట్టుకథను అల్లిపెట్టుకున్నాను. మా ఆవిడకు, నాకూ బొత్తిగా పొసగడంలేదు. నేను విడ్డమంటే తాను తెడ్డమంటుంది. నా రాబడికిమించిన దుబారా ఖర్చులు తెచ్చిపెడుతుంది. కాదు. కూడదని హద్దుల్లోపెట్టదలుచుకుంటే, పుట్టింటికి వెళ్ళి నెలల తరబడి శిక్ష వేస్తుంది. ఈ జబ్బును నయంచేసేమందు ఏ షాపులో దొరుకుతుంది? విడాకులొక్కటే శరణ్యమనిపించడంతో నాకు న్యాయశాస్త్రంతో పని తగిలింది. కిలేగి వాత పెట్టేవాడేగదా

వేకెట్! నా కిప్పుడు వకీలుగారి సలహా [illegible] కావాలి...

పత్రికలు తిరగవేస్తూ వెయిటింగు రూములో కూచున్నాను. ఆ గది తలుపులు గూడా హాల్లోకి తెరచుకుని వుండడంవల్ల గృహాంతర్భాగంలో కూచున్నట్టే వుంది. ఇందాకా నన్ను పలకరించిన వ్యక్తి బాత్ రూములో పిల్లలకు స్నానం చేయిస్తున్నాడు. వంటింట్లో పొయిమీదవున్న పెనం దోసెల తయారీలో నిర్విరామంగా పని చేస్తూవుంది.

'ఎంతగా పిల్లలకు నీళ్లుపోస్తే మటుకు చెంబులు, తప్పేలాలు అలా గొంతుచించుకోవాలా?' ఆ గొంతు యజమానురాలిది.

'ఏదీ, నువ్వు చుంయ్, చుంయ్ మన కుండా దోసెలు కాల్చు చూద్దాం!'

'హవ్వ, హవ్వ' అంటూ నోరు నొక్కుకోవాల్సిన పరిస్థితి! ఇంటి నౌఖరు యిల్లాలితో మాట్లాడవలసిన తీరేనా యిది?

అంతఃపుర విద్రోహానికి బాగా అలవాటు పడినట్టున్న నౌఖరు మహాశయుడు స్నానాలు పూర్తయ్యాక బిడ్డలకు బట్టలు తొడిగాడు. 'వీళ్లకు టిఫిన్లు పెట్టొచ్చు' అంటూ వాళ్లని వంటగదిలోకి సాగనంపాడు. మళ్లీ బాత్‌రూములోకి వెళ్లి 'బాయిలర్ మరిగి పోతోంది. ఏకంగా యిద్దరికీ సరిపోవచ్చు' అన్నాడు.

'ఇంకా నయం! ఇద్దరమూ కలిసే స్నానం చేద్దామన్నావుకాదు...'

ఇంక నాకక్కడ కూర్చోవాలనిపించలేదు. అలనాటి సమావేశంలో సత్యారావు స్టేట్‌మెంటుకు, యిక్కడ యింట్లో సాగుతున్న తతంగానికి పోటాపోటీ చూచుకుంటే నాకు నవ్వొచ్చింది. ఇంటి యిల్లాలు నౌఖరుతో సరాగాలు పోతున్న విధానాన్నిబట్టి చూస్తే గృహస్వామి యిప్పుడిప్పుడే తిరిగివచ్చే జాడలు కానరావడం లేదు. ఆవతల వూళ్లో నాకింకా కొంతపని మిగిలివుండిపోయింది. సత్యారావును కలుసుకోవలసిన అవసరం వున్నదీ, లేనిదీ తెలిగ్గా నిర్ణయించుకోవాలి.

ఆ నాటి మధ్యాహ్నం భోజనమైన తర్వాత హోటల్ గదిలో పడుకునివుండగా నా ఆలోచన మళ్లీ పెండింగు ఫైలు మీదికి వెళ్లింది. కొత్తగా నాలిసిన వర్తమానంతో సత్యారావు కథను పూర్తి చేయడానికున్న అవకాశాలను గురించి నాలో విచిత్రం [illegible] లోకజ్ఞతను అవహేళన చేసినట్టవుతుంది గనుక అప్పుడీ కథతో ఆయన సత్యారావు దంపతులకిచ్చిన సలహాను చొప్పించడం అనవసరమేమో! ఈ సత్యారావు అనే వ్యక్తి అమాయికుడైనా కావాలి. లేదా భార్య ప్రవర్తనను కప్పిపెట్ట దలచుకునే గడుసువాడైనా కావాలి. ఈ రెండింటిలో ఏవూహ నిజమనేది ఒకసారి సత్యారావుతో మాట్లాడితేగానీ బోధపడదు.

ఏది ఏమైనా సాయంకాలం ఆరుగంటల బస్సులో నేను తిరుగుప్రయాణం చెయ్యవలసి వుండడం తప్పనిసరి! ఆలోగా సత్యారావుతో ఒకసారి మాట్లాడగలిగితే, పెండింగు ఫైలును ఏదో ఒక విధంగా క్లోజ్‌చేసే చొరవ నాకు లభించవచ్చు.

అందుకని మళ్లీ ఒకసారి సత్యారావుతో భేటీ కావడం కోసం ప్రయత్నించాను. ఈసారి సత్యారావు యింటికి వెళ్లేసరికి గంట మూడున్నర. ఆఫీసు రూంలో టైప్ రైటింగు యంత్రం టకటకలు వినిపిస్తున్నాయి. ఓ అడుగు లోపలికి వేశానో లేదో అత్యద్భుతంగా సింగారమైవున్న లేడీ టైపిస్టు విరటి మెడను ముందుకుసాచి [illegible] తన ప్రశ్నించింది. 'అడ్వొకేటుగారున్నారా?' అని ప్రశ్నించాము. 'నిద్రపోతున్నారు. వచ్చేస్తారుగానీ కాసేపు వెయిటింగు రూములో కూచోండి' అంది టైపిస్టు.

ఉదయంలాగే సాయంకాలంగూడా పత్రికలే శరణ్యంగా పదిపదిహేను నిమిషాలవరకూ గదిలో కూచున్నాను.

వెయిటింగురూముకులాగే, ఆఫీసు గదికి గూడా హాల్లోనుంచీ ప్రత్యేకద్వారం వుండి వుండలి. ఆ తలుపులు తెరచుకునే సవ్వడి వినిపించింది. పాదరక్షల చప్పుడుగూడా వినవచ్చింది.

'అప్పుడే అయిపోయిందా నిద్ర?'—లేడీ టైపిస్టు పరామర్శ.

'ఏదీ, నిద్రపోనిస్తేగదూ! నా చిన్నతనంలో మా అమ్మమ్మ ఒకావిడ యిలాగే తలంటుతుండేది! పాపం, శ్రమపడ్డావుగానీ, కాఫీ తీసుకో!'

హద్దిరభన్నా! అయ్యగారికీ లేడీటైపిస్టుతో పరాచికాలన్నమాట! హవ్వా! బాగుంది, బాగుంది, నా కథ రసకందాయంలో పడివచ్చేతోచింది.



# ప్రాచీన వైద్య పద్ధతులు

## సెగ్గడ్డలను, పెద్ద వ్రణములను కరిగించునవి - అణగగొట్టునవి - పగులగొట్టునవి

1. ఉమ్మెత్త ఆకులను నూరి— కాచిన ఆముదంలో వేసి ఆ ముద్దను క్రొత్తగా లేచిన గడ్డల పైన వేసి కట్టుకడితే—అవి శీఘ్రంగా హరించిపోతాయి. నొప్పి తగ్గుతుంది. లేదా వానిని మెత్తబరచి చితుకజేస్తాయి. ఉమ్మెత్తకాయను కుమ్ములో ఉడికించి— నూరి కట్టుకడితే వ్రణములు మానతాయి.

2. గన్నేరు వేరు లేక మ్రానుచెక్క మెత్తగా నూరి కట్టుకడితే గడ్డలు, కంతులు హరిస్తాయి.

3. కత్తిమందు చెట్టు పాలు పూయుట వలన గడ్డలు హరిస్తాయి. అంతేకాక రాచపుళ్ళు, వ్రణాలు కూడా తగ్గుతాయి.

4. గండఫేరోజా (దీనిని పారశీభాషలో బీజదు అని, హిందీలో బిరీజా అని అంటారు. ఇది ఒక చెట్టు యొక్క జిగురు అను ఒక చెట్టు జిగురును గ్లిజరినులో కలిపి పైన పట్టించినచో కంతులు, అడ్డగ్రలు కరిగిపోతాయి. గడ్డలు మెత్తబడి పగులుతాయి. దెబ్బలవాపు అణగగొట్టబడుతుంది.

5. పచ్చగుగ్గిలాని కంఠము పైన ఆయే గడ్డలకు, గండ మాలలకు పట్టువేస్తే అవి మానతాయి.

6. చింతబెరడు క్షారంలో, ఆముదపు గింజలలోని పప్పు సమానంగా వేసి—మెత్తగా నూరి — గడ్డలకు గాని, వ్రణాలకు గాని, రాచపుళ్ళకు గాని రోజుకి రెండుమూడు సార్లు చొప్పున నాలుగైదు రోజులు పట్టువేస్తే అవి హరిస్తాయి.

7. క్రొత్తగా లేచెడి గడ్డలపై జిల్లేడు పాలు పూస్తే అవి హరిస్తాయి.

8. శీతాఫల చెట్టు ఆకులు ఉప్పు మెత్తగా, నూరి కట్టుకడితే గడ్డలు మొదలగునవి త్వరగా చీముపట్టి పగులుతాయి.

9. ములు తోటకూర ఆకులను ముద్దగా నూరి —ఆముదంతో వెచ్చచేసి కట్టుకడితే మేహపుగడ్డలు, రక్తపుగడ్డలు త్వరగా చీము పట్టి పగులుతాయి.

10. సోమింత ఆకులను మెత్తగా నూరి ఆముదంతో వెచ్చచేసి కట్టుకడితే గడ్డలు త్వరగా చీముపట్టి పగులుతాయి. అంతేగాక రొమ్ము, రెక్కగూడు, మోకాళ్ళు వీనిలోని నొప్పులు కూడా తగ్గుతాయి.

### కాళ్ళ పగుళ్ళను మాన్పునవి

1. జీడిమామిడి విత్తుల పెచ్చులు గాటు సారాయిలో నానవేసి తీసిన చమురును పూసిన, కాళ్ళపగుళ్ళు మానతాయి. అంతేకాక సాధారణ కురుపులు,పొక్కులు, పుళ్ళు కూడాతగ్గుతాయి.

2. మర్రిపాలు పగుళ్ళపై కొన్నాళ్ళ పాటు పూస్తే అవి మానతాయి.

3. మామిడి జిగురును కాళ్ళ పగుళ్ళకు వేచి కాచినచో అవి నయమవుతాయి.. ఈ మామిడి జిగురులో నిమ్మపళ్ళ రసం గాని, నూనెగాని కలిపి పూసిన గజ్జి, చిడుము మొదలగు చర్మరోగాలుకూడా నయమవుతాయి.

4. సంపెంగ విత్తుల తైలాని కాళ్ళ పగుళ్ళకు పూస్తూ వుంటే అవి మానతాయి.

5. పక్కిచెట్టు పాలను కాలి పగుళ్ళకు పూస్తూ వుంటే అవి మానతాయి.

### నాడా పామును (టేప్‌వర్మ్) చంపేవి

1. ఒకటింపావు శేర్ల పరిశుద్ధమైన మంచినీళ్ళలో— అయిదారు తులముల దానిమ్మ వేరు చెక్కను (పచ్చిది) వేసి— సుమారు ముప్పావు సేరు నీళ్ళు వుండేటంత వరకూ యిగుర కాచి—ఆ నీళ్ళను ఉదయం మొదలు ప్రతీ అరగంటకు రెండు తులముల యెత్తు కషాయాన్ని అదంతా అయిపోయేటంత వరకూ యిస్తే టేప్‌వర్మ్ దానంతటదే పడిపోతుంది. లేదా మర్నాటి ఉదయం రెండుమూడు తులముల యెత్తు ఆముదం యిస్తే అది చచ్చిపడిపోతుంది.

2. ఇసుకదారికూర మొక్క యొక్క సమూలాన్ని తెచ్చి మెత్తగా నూరి— రెండున్నర తులముల చూర్ణంలో నీళ్ళు కలిపి త్రాగించాలి. ఉదయాన్నే పరగడుపున, త్రాగించాలి. తిరిగి అయిదవ దినంనాడు యిదే విధంగా త్రాగించాలి. టేప్‌వర్మ్ వచ్చి మలవిసర్జన సమయంలో పడిపోతుంది.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి

---

# బంగారుపాయ్యా

'ఎలావుంది కాఫీ?' ఈ సారి పరామర్శించేవంతు అడ్వొకేటుగారిది.

'అయ్యగారి హాస్పిటాలిటీ గురించి కొత్తగా చెప్పేది ఏముంది? షరామామూలే! నా చిన్నప్పుడు మా నాన్నమ్మ చేస్తుండిన పావ కంలావుంది,'

'ఆడపిల్లలు వుడతారట! అబద్ధమాడొద్దు...'

'సరాగాల మోతాదు తగ్గించాలి. అవతల వెయిటింగురూములో క్లైయింటున్నాడు.'

'హాలిడేలోగూడా క్లైయింట్లొస్తున్నారా? ఉదయం ఒకాయన లుంగీకట్టుకుని, అరచొక్కా వేసుకుని నేను కనిపించేసరికి, నన్ను అసలు సిసలు పనిమనిషనుకున్నాడు. మన్నప్లేట్లో టిఫిను పెట్టేశానని చెప్పావుగదూ, అప్పుడు నేను రోడ్డుపైకినెళ్ళి కాస్తా ఆలస్యంగా వచ్చిందందుకే! ఎవరోగానీ, ఎలా వచ్చాడో అలాగే మాయమైపోయాడు పాపం!'

చిట్టచివరిమాట వినవచ్చేసరికి నేను మళ్ళీ రోడ్డుపైనవున్నాను!

*   *   *

మీరే ఒట్టుపెట్టుకోమంటె ఆ ఒట్టొపెట్టుకుంటాను. దయానిధిగారు సత్యరావుకిచ్చిన సలహా ఏమిటో నాకీనాటికీ తెలియదు. కానీ దొరికిన క్లూలద్వారా నేనొక కంక్లూషన్‌కు రాగలిగాను. సత్యారావు తాను కోర్టులో లాయరుగా రాణించడం ఎంత ముఖ్యమనుకుంటున్నాడో,తనయింట్లో తన పనులు తాను చేసుకుపోవడంగూడా అంతే ముఖ్యమనుకుంటున్నాడు. అతడి భార్య దోసెలు కాల్చడంలాగే, టైప్‌చెయ్యడం గూడా గృహకృత్యాల నిర్వాహణలో ఒకభాగంగానే భావిస్తోంది. ఇక్కడ హక్కుల్లోగానీ బాధ్యతల్లోగానీ హెచ్చుతగ్గుల ప్రసక్తి లేదు. భరించేవాళ్ళులేదు. భరింపబడేవాళ్ళూలేరు. ఒక ఆడదీ, మగవాడు ఉత్తమ స్నేహితులుగా జీవితాంతం సహజీవనం చేయడానికి సిద్ధపడడమేనంటూ అన్యోన్యదాంపత్యానికొక కొత్త నిర్వచనం యిచ్చుకోవాలనిపిస్తుంది. బహుశా ఈనిర్వచనానికి మూలభూతమైన సత్యమేదో దయానిధిగారిచ్చిన సలహాలో వుండి వుండొచ్చు!

సీరియల్

# చరితార్థులు

### ఎస్.ఎస్. ప్రసూన

**జరిగిన కథ**

రమణమూర్తి, శేఖర్ బాల్య స్నేహితులు. రమణమూర్తి ఒక కంపెనీలో పని చేస్తున్నాడు. శేఖర్ స్టేట్స్‌కి వెళ్ళి భార్య సుమతితో సహా ఇండియాకు వచ్చి రమణమూర్తిని చూడ్డానికి వచ్చాడు. రమణమూర్తి భార్య ఇందిర, సుమతి ఇద్దరూ ప్రాణ స్నేహితులు. శేఖర్‌కి సెలవిచ్చి రమణమూర్తికి ఆలవాటు చేశాడు. శేఖర్ రిజైన్‌చేసి హైదరాబాదు మారడానికి ప్రయత్నాలు చేశాడు. మామగారు పోవడంతో అఘూరు బయల్దేరింది ఇందిర పిల్లలతో.

## 5

బికటిన్నర రోజులు ప్రయాణం చేస్తేనే కాని చేరుకోలేని దూరంలో వున్న పల్లెటూరది. రమణ, ఇందిర వెళ్ళేసరికి జరగవలసినదంతా జరిగిపోయింది. ఆఖరి చూపయినా దక్కలేదని ఆడదానిలాగా విలపించాడు రమణ. అప్పటిలో ఎవరు మాత్రం ఓదార్చగలరు? అనునయ వాక్యాలు బుర్రకెక్కేస్థితా అది! చిన్నతనంనుండీ తండ్రిపట్ల — భయభక్తులతో పెరిగిన రమణ, వయస్సు పెరుగుతున్నకొద్దీ — ఆ గౌరవాభిమానాలు మరింతగా పెరిగేయే గాని తరుగలేదు. మొదట్లో రమణ తండ్రిని వదిలి వుద్యోగరీత్యా అంత దూరం వెళ్లటానికి ఇష్టపడలేదు. కానీ— ఉద్యోగ ధర్మాన్ననుసరించి, తండ్రి ప్రోద్బలంతో వెళ్లక తప్పలేదు. అయినా తనతో పాటు తండ్రినికూడా రమ్మని ఎంతో ప్రాధేయపడ్డాడు. కానీ, ఆయన తను పుట్టిన పెరిగిన వూరిలోనే వృద్ధాప్యం గడపాలన్న కోరికతో — కొడుక్కి మెల్లగా నచ్చచెప్పి ఆ ప్రయత్నాన్నుండి విరమింప చేశారాయన. వృద్ధాప్యంలో తండ్రికి సేవ చేసే భాగ్యం లేకపోయిందని రమణ ఎప్పుడూ బాధపడేవాడు. సంవత్సరానికో నెల సెలవు పెట్టి వెళ్ళి తండ్రిదగ్గరవుండి అలా కొంత తృప్తిపడ్తూ వుండేవాడు. పదిహేను రోజులక్రితం ఏదో పని కల్పించుకుని వచ్చి తండ్రినిచూసి వెళ్లేడు. అప్పుడు ఖులాసాగానే తిరుగుతున్నారాయన, ఇంతలో ఇలా! భగవాన్ నేనేం పాపం చేశాను! కడసారిగా తండ్రిని చూచుకునే భాగ్యం లేకపోయింది. ధీర గంభీరమూర్తి అయిన తండ్రిరూపు ఇంక తనెన్నటికీ చూడలేనన్న బాధ మనస్సున సుళ్లు తిరుగుతూ కన్నీరుగా కారసాగింది. రమణ ఇంత బాధపడ్తున్నా — రమణ తమ్ముళ్లు అతడి బాధను పంచుకోకుండా నిర్లిప్తతగా తిరగసాగేరు. రాగానే నాలుగు కన్నీటి చుక్కలు లాంఛనంగా అన్నట్లు రాల్చి బుడిబుడి దీర్ఘాలుతీసి మర్నాటికే మామూలుగా కబుర్లతో కాలక్షేపంచేసే తమ్ముళ్లని చెల్లెళ్లనిచూసి, విస్తుపోయాడు రమణ. కానీ, కొందరు బాధను పైకి వ్యక్తపర్చకుండా మనస్సులోనే అణిమిపట్టి ధీరత్వం చెదరకుండా తిరుగుతారేమోనన్న వివేకంతో వివరిని ఏమనలేక మౌనంగా వుండి అన్ని సవ్యంగా జరిగేట్లు స్వయంగా తానై చూసుకున్నాడు. రావలసిన బంధువు లంతా వచ్చేరు. 'పదిమంచి బంగంగలవారి చావు పెళ్ళితో సమాన'మంటారు. అల్లాగే అయిదుగురు కొడుకులు — ముగ్గురు కుమార్తెలు, మనుములు, మనుమరాళ్లుగల పార్వతీశంగారు అదృష్టవంతులు.

కలిసి ఆయనకు జరుగవలసినదంతా సక్రమంగా నిర్వర్తించారు. పన్నెండవ రోజున 'పితృయజ్ఞమ్' అయిదువందల మందికి సంతర్పణ చేసి ఘనంగా జరిపాడు రమణ.

'పితృరుణం తీర్చుకున్నావు రమణా, తండ్రికి తగిన తనయుడవోయ్' అని రమణ భుజంతట్టి మెచ్చుకుని, నాలుగు ఓదార్పు వాక్యాలు పలికి వచ్చిన బంధుమిత్రులంతా తిరుగు ప్రయాణమయ్యారు. పన్నెండవరోజు సాయంత్రం ప్లీడరు రంగనాథంగారువచ్చి నాస్నేపు స్వాంతన వచనాలువలికి,

'తమ్ముళ్ళందరూ ఇంట్లోనే వున్నారా? వుంటే ఒకసారి పిలవ్వోయ్, అంతా కలిసి ఏకాభిప్రాయానికివస్తే మంచిది' అన్నారు రమణతో.

ఆయనెందుకు వచ్చారో రమణకు ఛప్పున స్ఫురించింది. మొదట్నుండీ వీరి ఆస్తి వ్యవహారాలు చూసేది రంగనాథంగారే. ఒకవిధంగా పార్వతీశంగారు, రంగనాథంగారు బాగా దగ్గర స్నేహితులు కూడాను.

రమణ వాళ్ళకు ఆయన్ని 'బాబాయ్' అని పిల్చేంత చనువుకూడా ఆయనదగ్గరున్నది. అందుకే ఆయన పనిగట్టుకుని స్వయంగావచ్చి వ్యవహారాలు మాట్లాడాలనటం రమణకు ఎంతో తృప్తిగా అనిపించింది.

అయినా మనస్సున కొండంత విచారం వుండగా ఇప్పుడే ప్రసక్తి రావటం ఇష్టం లేదు. అందుకే అన్నాడు.

'అంతతొందరేం వచ్చింది బాబాయ్! అంతా— కొడుకులు పోయాక చూద్దాంలెండి' అన్నారత

'కాదులే రమణా చిన్నవాడివి నీకు తెలీదు, నలుగురు వుండగానే అన్ని విష యాలు వివరంగా తేల్చుకోటం మంచిది. నీవూ — నీ తమ్ముళ్ళు చాలా దూరంనుండి వచ్చారు. మళ్ళీ, మళ్ళీ అంతదూరం రావటం అంటే మాటలా? అనేకాక ఈ వూరితో మీకున్న బంధం మీ నాన్నగారేగా! 'ఇంక తరువాతమాట పూర్తిచేయలేక కండువాతో కళ్ళు వత్తుకున్నారు రంగనాథంగారు.

రమణ కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది. మొహం తిప్పుకుని తుడుచుకుని,

'అమ్మాయ్ మీనా! తమ్ముళ్ళెక్కడ వున్నారు? రఘు-చంద్రం, రాజా, బాబు అందర్నీ ఇలా పిలు — ప్లీడరు బాబాయ్ మాట్లాడటానికి వచ్చారని చెప్పు' అని చెల్లెల్నిపిల్చి అన్నాడు రమణ.

కాస్సేపటికి రమణ తమ్ముళ్ళు నలుగురు— చెల్లెళ్ళు ఇద్దరూ-అక్కయ్యా—మేనత్త రాజమ్మా అంతా వచ్చి వరండాలో కూర్చున్నారు. అందర్నీ ఒకసారి పరకాయించిచూసి, ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే జేబులోంచి సీలువేసిన కవరొకటితీసి రమణకు ఇచ్చారు రంగనాథంగారు.

'ఇందులో మీ నాన్నగారుఅంతా వివరంగా వ్రాశారు. ప్రత్యేకించి నేను చెప్పవలసింది ఏమీలేదు' అన్నారు రంగనాథంగారు.

ఆ కవరులో ఏమున్నదీ అని అందరికీ ఆత్రంగా వున్నప్పటికీ — ఆయన ముందు బైటపడటం బావుండదని తమాయించుకున్నారు.

రమణ మెల్లగా కవరువిప్పి అందులో వీలునామాకు జతపరిచి వున్న కాగితంతీసి చదవసాగాడు:

నాయనా రమణా,

ఇంటికి పెద్దకొడుకువిగా—నీ బాధ్యత నీవు గుర్తించి, నా భావాల్ని — నా చర్యలను అర్థంచేసుకుని గౌరవించేవాడివి యెప్పుడున్నా. అందుకే మొదట్నుంచీ నీమీద నీ ధృఢమైన వ్యక్తిత్వంమీద నాకు అపారమైన నమ్మకంగ వున్నది. ఆ నమ్మకంతోనే ఇప్పుడు నా నిర్ణయాల్ని నీ ముందు వుంచుతున్నాను ఈ నీ ముసలితండ్రి చివరి కోరికను. అభిలాషను నీవు అర్థం చేసుకుని సమ్మతిస్తావనే ధైర్యం నాకు వున్నది. నీ తమ్ముళ్ళలో రాజా — చంద్రం కాస్త తొందరపాటు స్వభావం కలవాళ్ళు. వాళ్ళకు నచ్చచెప్పే బాధ్యతకూడా నీమీదే వుంచుతున్నాను.



# చరితార్థులు

నాకు పితార్జితం అస్తి ఎంత సంక్రమించినది అది ఏవిధంగా ఖర్చు అయినదీన్నీ నీకు—నీ తమ్ముళ్ళకు వివరంగా ఇదివరకే తెలియచేశాను. ఆ సంగతి మీకు తెల్సు. కాగా—ఇప్పుడు నాకుగా మిగిలిన ఈ కొద్దిపాటి అస్తి అంతా నా స్వార్జితమేనన్న సంగతికూడా మీకు తెల్సును.

మీకందరికి మీరు కోరినంత చదువులు చెప్పించాను. ఒకరికెక్కువా, మరొకరికి తక్కువా చేసిందిలేదు. భగవదనుగ్రహంవలన మీరంతా ప్రయోజకులై మంచి పొజిషన్‌లో వున్నారు. అది నాకెంతో సంతోషమున్నూ—గర్వకారణంకూడాను. ఇంక మీరు ఒకరినుండి ఆశించదగనది ఏమీవుండదని నా అభిప్రాయం.

నా జీవితమంతా ఒకరికోసం శ్రమించటంలోనే గడిచిపోయింది. అది నా డ్యూటీగానే భావించానుగాని, బాధపడింది ఎప్పుడూ లేదు. పైగా నా బాధ్యతా నిర్వహణలో సంతృప్తికూడా కలిగింది. సరి అదంతా అప్రస్తుతం. ఇప్పుడు నాకు మిగిలిన ఈకొద్దిపాటి ఆస్తి మీరంతా పంచుకుంటే వచ్చేది బహుస్వల్పం. ఈ కాస్త మీకు లేకపోయినా మీరు నష్టపోయేది ఏమీవుండదు. కాబట్టి ఈ చివరిదశలో. నా స్వార్జితం కొద్దిపాటి. నా కోరిక మేరకు వినియోగించాలనే నా అభిలాష. దీనికి మీరున్నూ వ్యతిరేకించరనే భావనతో నా తుదినిర్ణయాన్ని తెలియచేస్తున్నాను. అది ఏమనగా.

తూర్పువేపు పొలం అయిదెకరాల పల్లపు భూమి, నా ఆరాధనా దైవం వేణుగోపాలస్వామికి నిత్యనైవేద్యాల నిమిత్తం భక్తితో సమర్పించుకుంటున్నాను తనువాత...ఇప్పుడు నేను నివసించే ఈ చిన్న ఇల్లు. నా బాల్య మిత్రుడు జగన్నాథం మాష్టారికి చెందాలి. వాడిది చిన్నప్పటినుండి కష్టాల బ్రతుకే అయింది. చేతికి అందివచ్చిన కొడుకులు వున్నప్పటికీ—తండ్రిని ఆదుకునే తనయుడు ఒక్కడూలేక—ఎవరి బ్రతుకువారే బ్రతుకుతూ—తండ్రి సంగతే పట్టించుకోకపోతే బ్రతుకుభారాన్ని మోయలేక మోస్తూ—అద్దెకొంపల్లో అగచాట్లుమారి బ్రతుకు బ్రతుకుతున్న జగన్నాథానికి ఇది నా స్నేహపూర్వకమైన కానుక. ఇది నిరాకరించకుండా వాడు స్వీకరించేట్లు చేసే బాధ్యత కూడా నీకు అప్పగిస్తున్నాను. కాగా...శిరీష్ బాధ్యత పూర్తిగా నీకు అప్పగించక తప్పలేదు. శిరీష్ పెళ్ళిచేయలేకపోయాననే అన్న బాధతోపాటు. శిరిని నీవు నా కన్నా మిన్నగా చూచుకుంటావనే ధైర్యంకూడానాకువున్నది. దాని వివాహ ఖర్చుల నిమిత్తం పదిహేను వేలు బాంకిలో వుంచాను. ఇక రాజమ్మ సంగతి — చిన్నప్పుడే కుంకుమ చెరిగి పుట్టింటికిచేరి ఇంతకాలం నాదగ్గిరేవుండి—నా చివరిరోజుల్లో నాకు సేవచేసి నన్నే నమ్ముకున్న రాజమ్మకు అయిదువేలు కేటాయించాను. రాజమ్మ మీలో ఎవరివద్దనన్నా వుండటానికి ఇష్టపడితే సరే—లేదా! ఈ ఇంట్లో ఒకగది దానికై ఇవ్వవలసిందిగా నా కోరిక — ఈనాచివరి కోరికల్ని అర్థం చేసుకుని — మన్నించి...నా కోరిక మేరకు అన్నీ సవ్యంగా జరిగేట్లుచూసే బాధ్యత—హక్కు—ప్లీడరు రంగనాథంగారికి—నీకు అప్పగిస్తున్నాను.

ఇట్లు
నీ తండ్రి
పార్వతీశం వ్రాలు.

చదవటం ముగించిన రమణ; తమ్ముడు రాజు చేతికిచ్చేడు. కాగితాలు గబగబా అది




అందరి చేతులూ మారాయి. రమణతప్ప మిగతా అందరి మొహాలు ముడుచుకున్నాయి.

'అంతా తనిష్టప్రకారమే చేశాడుగా! ఎవరితోనన్నా సంప్రదించాడా ఏమన్నానా? ఇంక మాకు చెప్పటం ఎందుకు. వున్న ఆ కొద్దిపాటి పొలం అయినా మాకు దక్కకుండా మమ్మల్ని ముంచేశాడు ముసలాడు' అని కాగితం రమణమీదకు విసిరి దూకుడుగా లేచాడు చంద్రం.

'రాజమ్మ అత్తయ్యపాటి విలువ అయినా మాకు లేకపోయింది' ముక్కు ఎగబీల్చి రాగాలు తీసింది రమణ అక్కయ్య కామాక్షి.

'అమ్మాయ్ మీరిలా గొడవచేస్తే బావుండదు. మీ నాన్న ధర్మరాజులాగా బ్రతికేడు. ఆయన చివరి కోరిక తీర్చటం మీ కర్తవ్యమమ్మా. ఈ కొద్దిపాటి ఆస్తివలన మీకు లభించే లబ్ధి ఏమీలేదు. మీ నాన్నమాట గౌరవించారన్న పేరు, ఖ్యాతీ మీకు లభిస్తాయి. ఆయన కోరిక అర్థం చేసుకుని ఆమోదిస్తే ఆయన ఆత్మకు ఎంతో శాంతి కలుగుతుంది' నచ్చచెప్ప చూశారు రంగనాథంగారు.

'నా మటుకు నాకు ఎంతో సంతోషంగా వున్నదండీ —మా నాన్నగారి నిర్ణయాన్ని నిండు మనస్సుతో సమ్మతిస్తున్నాను. ఇదంతా సరిచూసే బాధ్యత మీదేనండీ బాబాయ్. నా ల్లురోజుల్లో ఎవరిదారిన వాళ్ళం వెళ్ళిపోతాం. ఇంటి సంగతి మాష్టారికి చెప్పండి' రమణ గంభీరంగా అన్నాడు.

'ఆ తండ్రికి తగిన తనయుడవయ్యా—నిన్నుగన్న మీనాన్నగారు ధన్యులు. రమణా మరి నేను వస్తాను—రేపు మళ్ళీ కలుద్దాం' అంటూ లేచారు రంగనాథంగారు.

ఆ రాత్రి ఇంట్లో మనుష్యుల మాటలే వినరాక ఇల్లంతా నిశ్శబ్దమే అలముకున్నది తినీ—తినీకా ఎవరికి తోచినచోట వాళ్ళు నడుం వాల్చేరు.

'మనకన్నా అత్తయ్యే నయం; అయిదు వేలు రాబట్టుకున్నది. కడుపున పుట్టిన పిల్లలకు ఆమాత్రమన్నా లేకపోయింది' రాజమ్మకు కాస్త దూరంలో పడుకున్న కామాక్షి, మీనాక్షి గుసగుసలు రాజమ్మ చెవినబడి — బాధతో మనస్సు చుట్టుకుపోయింది. 'మేరువులాటి అన్నయ్యే పోగాలేంది, ఈ అయిదువేలు నన్ను రక్షిస్తాయా? నేను కావాలని అడిగేనా, ఎవరి పంచననడివున్నా గుప్పెడు మెతుకులు పెట్టకపోరు. ఈ ముసలి బతుకు యెల్లా

గా నావేళ్ళ మారిపోతుంది. ఈ డబ్బుమీద నాకేమీ ఆశలేదు మీరే తీసుకోండి' అని అరచి చెప్పాలనిపించింది. కానీ, కామాక్షి ముందు నోరెత్తి బ్రతకడం కష్టం— ఎందుకొచ్చిన రభస—అని మౌనంగా కన్నీరు కార్చసాగింది.

ఆమెకు తన బాల్యజీవితము — ఎదుర్కొన్న కష్టాలు — ఎటువంటి పరిస్థితుల్లోనయినా దిగజారిపోకుండా ధైర్యంగా నిలిచి, తమకు చేదోడు కలిగించే అన్నగారి ధీరత్వము — అన్నీ తెరలు—తెరలుగా ఆమె మనస్సున తిరగసాగాయి.

* * *

పి. యు. సి. పరీక్షలు వ్రాసి వుత్సాహంగా వచ్చి ఇంట అడుగు పెట్టగానే,

'నాయనా! ఇంటికి ఇక నీవే దిక్కు— ఇంత సంసారాన్ని ఎలా గట్టెక్కిస్తావో!' అని తనని వాటేసుకుని గొల్లున ఏడుస్తున్న తల్లినిచూసి చిత్తరపోయాడు పదహారేళ్ళ పార్వతీశం.

ఇల్లంతా బంధువులతో నిండివున్నా — కళావిహీనంగా— పాడుపడినట్లుగా వున్నది. అందరి మొహాల్లోను విచారం తాండవిస్తోంది. అర్థంకాని పిచ్చిచూపులతో అల్లాగే గోడకానుకుని నిలబడిపోయాడు పార్వతీశం.

అతని వాలకంచూస్తే — అతనికి ఏమీ తెలీనట్లే వున్నది.

'ఏం బాబు నీకు వైరు అందలేదా?' ఎవరో అడిగారు.

'వైరేమిటి? అందలేదే! పరీక్షలు అవగానే నేను మా స్నేహితుడు వూరువెళ్ళి యిప్పుడే వస్తున్నాను, ఏంజరిగింది?' ఆశ్చర్యంగా అందరివేపూ చూస్తూ అడిగాడు.

'జరగరాని దుర్ఘటనే జరిగింది. మీ నాన్న పోయి మూడురోజులైంది. నీకు వెంటనే వైర్ ఇచ్చాము. ఒకరోజంతా నీకోసం చూశాము. నువ్వు రాలేదు. జరిగేది ఆగుతుందా? నీకు ప్రాప్తి లేకపోయింది. అంతా దురదృష్టం' ఇంకా ఏవేవో అంటున్నారు అంతా. అతనికి వినేశక్తి లేక కళ్ళు మూసుకుని నిలబడిపోయాడు. అంతా తలో మాట అంటున్నారు — ఏమీ అతడి బుర్ర కెక్కటం లేదు. మెదడంతా మొద్దుబారి ఆలోచనా రహితమైంది. అలాంటి స్థితిలోనే ఆ పదిరోజులు గడిచిపోయాయి.

వచ్చినవారంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయాక, తనూ— తల్లీ— ఇద్దరు తమ్ముళ్ళు— ఆరుగురు చెల్లెళ్ళు— ఒంటరిగా ఎడారిలో నిలబడినట్లు మిగిలిపోయారు.

కాలం ఎవరికోసము ఆగదు. ఎవరి సుఖదుఃఖాలతోను నిమిత్తం లేకుండా దాని దారిన అది పరుగులిడుతూనే వుంటుంది.

రెండునెలలు గడిచిపోయాయి. ఈ కొద్దికాలంలోనే పార్వతీశం మానసికంగా ఎంతో ఎదిగిపోయాడు. వయస్సుకు మించిన గాంభీర్యం — గుండె నిబ్బరం అలవడింది.

* * *

'అన్నయ్యా! రిజల్ట్సు వచ్చాయి' అని తమ్ముడు కదిపి లేపుతూంటే కళ్ళు నులుముకుంటూ లేచిన పార్వతీశం, నిరాసక్తిగా పేపరు చేతిలోకి తీసుకుని చూసి పక్కన పడేసి లేచి వెళ్ళేడు. అన్నగారు శుభవార్త చెప్తాడని ఆత్రంగా ఎదురు చూసిన తమ్ముడు చిన్నబోయిన మోముతో పక్కకి తప్పుకున్నాడు.

కాఫీగ్లాసు అందించి. కొడుకు ఏమన్నా చెప్తాడేమోనని ఆశగా అతడి మొహంలోకి చూసిన రాజేశ్వరమ్మకు తనాశించిన వుత్సాహం అతడి మోములో కనపడలేదు.

చిన్నకొడుకుని పక్కకి పిల్చి—'ఏమిరా! అన్నయ్యా పరీక్షపోయిందేమిటి' మెల్లిగా అడిగింది.

'ఫస్టుక్లాస్ స్టూడెంట్స్ అన్నయ్య పరీక్ష పోవటమేమిటమ్మా! ఎందుకో చెప్పటంలేదు. బహుశా— మెడిసిన్ చదివే అవకాశం లేదని దిగులుపడుతున్నాడేమో!' అన్నాడు వాడు. ఆవిడకూ అది నిజమేనేమో ననిపించింది.

మధ్యాహ్నం భోజనం చేస్తున్న పార్వతీశానికి నెయ్యి వడ్డిస్తూ మళ్ళీ ఆ సంగతే అడిగిందామె. 'ఏదో పాసైనానులే' అదో పెద్ద విషయం కానట్టు నిర్లిప్తతగా అన్నాడు అతడు.

'అదేమిటి నాయనా! ఇంత మంచివార్త చెప్పకుండా ఇంతసేపు దాచుకున్నావు.'

'అమ్మా! సంతోషించే స్థితిలో నే వున్నామా' అతడి కళ్ళల్లో నీరు కంఠంలో వణికింది, ఆమెకి దుఃఖం ఆగలేదు. కొంగుతో కళ్ళు వత్తుకుని,

'ఏం చేస్తాం, నీ అభివృద్ధిచూసి సంతోషించే అదృష్టం మీ నాన్నగారికి లేదు. వింత యేడ్చినా పోయినవాళ్ళతో పోలేము— జరిగేవి ఆగను ఆగవు. నువ్వు దిగులు పడకురా తండ్రీ—మీ నాన్నగారు మరీ నిరాధారంగా మనల్ని వదిలిపెట్టలేదు. ఏదో నాలుగుగింజలువచ్చే కొంత వున్నది. నీకు మెడిసిన్ చదవాలనివుంటే తప్పకుండా చదువు— నీ చదువుకై ఈ కొద్దిపాటి పొలం ఖర్చుఅయినా ఫరవాలేదు. నీవు అభివృద్ధిలోకివచ్చి ఈ ఇంటికి అండగా నిలిస్తే అంతకన్నా కావాల్సిందిలేదు—మీ నాన్నగారి ఆత్మకూ తృప్తికలుగుతుంది' ఆవిడ మాటకు అడ్డు వస్తూ—

'అమ్మా! ఇప్పుడా సంగతులెన్నీ ఏందుకు? తరువాత మాట్లాడ్దాంలే' గబగబా తినటం ముగించి లేచి వెళ్ళేడు.

గదిలో మంచంమీద పడుకున్న పార్వతీశానికి, గుబులుగుబులుగా బాధ గుండెల్లో సుళ్ళు తిరగసాగింది. ఈరోజు నాన్నగారు వుంటే ఎంత సంతోషించేవారో? ఆయన కోరిక మేరకు తను కష్టపడి చదివి ఫస్టు క్లాస్‌లో పాసైనాడు. కానీ తన సంతోషం ఎవరితో పంచుకోవాలి? అమ్మ మొహం చూస్తే గుండె పగిలిపోతూంది. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు రెక్కలురాని పసివాళ్ళు — హే భగవాన్! ఎందుకీ సంసారాన్ని ఇలా కూలద్రోశావు. ఇంత సంసారభారం తనొక్కడు మోయగలడా! కన్నీటితో చెంపలు తడిసిపోయాయి. తను మెడిసిన్ చదివి గొప్ప సర్జన్ కావాలని నాన్నగారి కోరిక. తనకూ అది ఇష్టమే— కానీ... ఇప్పటి పరిస్థితుల్లో తను చదవలేడు. ఉన్న కాస్త పొలం తనకై ఖర్చుచేసే స్వార్థపరుడు కాలేడు. అదికాదు తనమార్గం ... గంటల తరబడి ఆలోచనలో మెదడు తిరిగిపోగా చివరికో నిర్ణయానికివచ్చి— తల విదిలించి లేచాడు. అప్పుడతడి మనస్సెంతో తేటపడినట్లు అనిపించింది.

* * *

వారం పదిరోజుల తరువాత రాజేశ్వరమ్మ మళ్ళీ అడిగింది.

'ఏం బాబు! అప్లికేషన్ పెట్టే టైము దాటిపోతుందేమో— మెడిసిన్ సీటు సంపాదించటానికి ఎంతో తిప్పలు పడాలట! మీ

మామయ్యకు కబురు చేస్తాం—ఆ విషయం? లేదో చూసుకుంటాడు.'

'వద్దమ్మా, ఇంక నేను చదవను. ఆ కాస్త పొలం నాకై ఖర్చుచేయటం నాకు ఇష్టంలేదు. అది చెల్లాయిల పెళ్ళిళ్లకు 'వినియోగ పడాల్సిందే' స్థిర నిర్ణయంతో అన్నాడు.

తరువాత ఎవరెంత చెప్పినా మెడిసిన్ కోర్సు చదువటానికి అతడు ఒప్పుకోలేదు. చివరికి తల్లి బలవంతంమీద బి. ఏ. చదవటానికి నిర్ణయించాడు. బి. ఏ. చదివిన ఆ మూడు సంవత్సరాలు అసిధారావ్రతం లాటి జీవితం గడిపేడు. వారాలు చేసుకు తిని—పార్ట్ టైమ్ జాబ్స్ చేసి—ట్యూషన్లు చెప్పి—ఎల్లాగో కష్టపడి తన ఖర్చులకై తానే సంపాదించుకుని ఫీజులతో సహా అందులోనే సరి పెట్టుకునే వాడు గాని—ఇంటినుండి ఒక రూపాయి అయినా తీసుకునేవాడు కాదు. పొలంమీద వచ్చే అయివేజు ఇంటి ఖర్చుల నిమిత్తం కొంత పోగా మిగిలినదంతా చెల్లెళ్ల పెళ్ళిళ్ళకు తమ్ముళ్ళ చదువులకు బాంక్‌లో వేసేవాడు. అతడి పట్టుదలకు, సంయమనానికి తోటిమితులు విస్తుపోయేవారు—గిట్టనివాళ్లు హేళన చేసేవారు. పార్వతీశం ఎవరి మాటలకూ చలించడు. తన సంకల్పం వీడలేదు అల్లాగే బి. ఏ. అయిందనిపించి గుండెలమీద బరువు దింపినట్లు తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు.

ఎమ్. ఏ. చదవమన్నవారి మాటలు పక్కకు తోసి—సర్వీసు కమీషను పరీక్షకు వెళ్తానన్న అతణ్ణి అందరూ వేళాకోళం చేశారు.

'ఆ గుమాస్తా వుద్యోగమంటే నీ కంత మోజెందుకురా?' అని నవ్వినవాళ్ళకు

'ఈ రోజుల్లో ఎక్కడ చూసినా 'నో—వేకెన్సీ' బోర్డులే వెక్కిరిస్తుంటే ఆ గుమాస్తా వుద్యోగం వచ్చినా మహా భాగ్యమే' అన్నదే అతడి జవాబు.

అల్లాగే—'తాలూకాఫీసులో క్లర్కుగా చేరిన రోజున అతడు నిజంగానే సంతోషించాడు. అతడి నూటియైన స్వభావము—నైతిక వర్తన—కొద్దికాలంలోనే అధికారుల మన్ననకు పాత్రమై 'హెడ్ గుమాస్తాగా' ప్రమోషన్ అందుకున్నాడు. తరువాత పట్టువీడని ... సంకల్పశుద్ధితో

# చరితార్థులు

ఆత్మవిశ్వాసంతో—అంచెలంచెలుగా పరీక్షలు పాసై గుమాస్తా పార్వతీశం—'మాజిస్ట్రేట్ పార్వతీశంగారు' అన్న హోదా అందుకున్నాడు.

మాజిస్ట్రేట్‌గా ప్రమోషన్ ఆర్డరు అందుకున్నరోజున, ఇంటికి వస్తూనే తల్లి పాదాలకు వంగి నమస్కరించి,

'ఎటువంటి పరిస్థితుల్లోనూ ధర్మం తప్పకుండా—నా డ్యూటీ నేను సక్రమంగా నెరవేర్చకలిగే మనోధైర్యం కలిగేటట్లు దీవించు అమ్మా' అన్నాడు వినమ్రంగా తల వంచి పార్వతీశంగారు.

అంచులు తాకే ఆనందంతో కొడుకుని ఆప్యాయంగా లేవనెత్తి,

'నాయనా, మంచివాళ్ళకు భగవంతుడు సదా అండగానే వుంటాడు. నైతికచ్యుతి డివి కాకుండా—నీ కర్తవ్యాన్ని నీవు నెరవేర్చి—నలుగురు మెచ్చే మార్గాన్ని అనుసరించి మీ నాన్నగారి కీర్తిని నిలుపు తండ్రీ, నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ వుంటాయి. భగవంతుడు సదా నిన్ను కాపాడుతాడు' అని నిండు మనస్సుతో దీవించిన తల్లి మాటలే అతడికి వేదవాక్యాలై మనస్సున నాటుకున్నాయి—ఆ బలమే అతణ్ణి ధర్మమార్గంలో పురోగమింప చేసింది. ఆలోగా ఆ ఐదుగురు చెల్లెళ్లకు అనుకూలమైన సంబంధాలు చూసి పుస్తుంతలో ఘనంగా పెళ్ళిళ్ళుచేసి అత్తవారి ఇండ్లకు అంపకం పెట్టేడు.

పెద్దతమ్ముడు గోవిందరావు పి.యు.సి. మూడుసార్లు తప్పి ఇంక చదవనని మొండికెత్తి, తనవాంతు ఆస్తి పంచి ఇస్తే బిజినెస్ చేసుకుంటానని మంకుపట్టు పట్టేడు. పంచుకుందుకు ఆస్తి ఏమిలేదని తెలిసి—అంతా చెల్లెళ్ల పెళ్ళికే ఖర్చు చేసినందుకు విగిరిపడి నానా గొడవ చేస్తే—చివరికి మిగిలిన ఒక్క ఇల్లు అమ్మేసి ఆ వచ్చిన పైకమంతా తమ్ముడికిచ్చేశారు పార్వతీశంగారు—అదృష్టం బాగుండి వ్యాపారంలో ఎక్కువచ్చి లక్షలార్జించాడు గోవిందం. కానీ అన్నగారన్నా—తల్లి అన్నా వీసమెత్తు గౌరవమేనా లేదు. పైగా ఆస్తి అంతా అన్నగారు ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేసి—తనకేమీ మిగల్చలేదని—చివరికి తనివంత చదువేనా తనకు చెప్పించలేదని—తనే స్వయంకృషితో ఇంతవాణ్ణయ్యానని—అందరిముందూ చాటేవాడు. పూర్వాపరాలు తెలిసినవారు అతడి నీచబుద్ధికి అసహ్యించుకునేవారు. తెలిని వారు గోవిందానికి సానుభూతి చూపేవారు. ఎవరెలా అనుకున్నా పార్వతీశంగారు పట్టించుకునేవాడు కాదు. రెండో తమ్ముడు నరేంద్ర మెడిసిన్ ఫైనల్లో వుండగా వాళ్ల కాలేజీ ప్రిన్సిపాల్ కూతుర్ని ప్రేమించి పెళ్ళి చేసుకుని మకాం వారింటికే మార్చి బంగారుపంజరంలో బందీ అయాడు. అతడికి అన్నగారు—తల్లీ—చెల్లెళ్ళపట్ల ఎంత అభిమానం వున్నా బాహ్యంగా చూపటానికి వీలయేది కాదు. పార్వతీశంగారి మనస్సు చిన్నతమ్ముడి పట్ల జాలితో ఆర్ద్రమై పోయేది. అందుకే తమ్ముడు అమ్మను అభిమానించటంలేదని చెల్లెళ్ళకు ఆదరించటంలేదని ఎప్పుడూ బాధపడేవారు కాదు.

తమ్ముళ్ళిద్దరి బాధ్యత కూడా తానే నిర్వహించేవాడు. పార్వతీశంగారి భార్య లలితాంబ భర్త మనస్సెరిగి నడుచుకునే ఉత్తమ గృహిణి. సంసార పరిస్థితుల్ని—తన బాధ్యతల్ని అవగాహన చేసుకుని, నిండు మనస్సుతో తన కర్తవ్యాన్ని నిర్వర్తించేది. పురుళ్ళకనీ—పండుగ పబ్బాలకనీ వచ్చిపోయే ఆడబడుచులతోనూ—బంధువర్గంతోనూ ఇల్లెప్పుడూ సత్రవులాగా వుండి వండి వార్చటంతోనే ఆమె కాలమంతా వినియోగమయేది. పేరుకు వంట మనిషివున్నా—అన్నీ తానై స్వయంగా చూచుకుంటేనేగాని ఆమెకు తృప్తిగా వుండేది కాదు. ఎంత పని వత్తిడిలోవున్నా—చిరునవ్వు చిందులాడే మోముతో—ఎవరికీ లోటు రాకుండా వేయికన్నుల కనిపెడ్తూ—భర్త అవసరాలు గుర్తెరిగి—ఆయన కనుసన్నల మెలగుతూ—సమర్థవంతంగా సంసారాన్ని నిర్వహించే భార్యను చూసి ప్రేమపూరితమైన మనస్సుతో ఆమెకు కృతజ్ఞత చెప్పకు—గర్వపడేవారు పార్వతీశం.

(ఇంకా వుంది)

'ఏమండోయ్.'

'...............'

'ఇదుగో మిమ్మల్నే.'

'ఆఁ—ఏమిటి?' పుస్తకంనుంచి ఈ లోకంలోకి వచ్చాను.

'ఒకసారి ఇలా వస్తారూ'

ఏదో రహస్యం చెప్పేందుకు పిలిచే పద్ధతి ఇది. చదువుతున్న పుస్తకం చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది వదల బుద్ధిపుట్ట లేదు.

'నువ్వే ఇటు వద్దూ.'

'బాగుంది వరస—' రుసరుసలాడుతూ వచ్చింది.

'ఇదుగో—ఇటు వినండి.'

'ఆఁ—వింటున్నాను చెప్పు.'

చేతులో పుస్తకం లాక్కొని అన్నది 'ఇదుగో మీరింక ఆ రంగనాధరావుతో కలిసి తిరిగారంటే నామీద ఒట్టు.'

'అదేమిటే—ఆయనేం చేశాడు పాపం—చాలా ఉత్తముడు—'

'ఆ ఉత్తములే—ఈ ధర్మరాజుకు లోక మంతా మంచివాళ్లుగానే కనిపిస్తారు—ఆయనతో మీరు స్నేహంచేయడానికి వీలులేదు—ఆయన మనింటికి రావడానికసలే వీలులేదు ముందే చెబుతున్నాను'

'ఎందుకు? రంగనాధరావు నన్నేమన్నా అన్నాడా?'

'లేదు—అంతా రంగనాధరావునే అంటున్నారు.'

'ఏమని.'

'ఆయన గుణం మంచిది కాదని.'

అదిరిపడ్డాను.

'ఏమంత ఆశ్చర్యపడతారు? రంగనాధరావు ఒట్టి స్త్రీలోలుడట! పెళ్లాన్ని ఎప్పుడూ ఏడిపిస్తూ వుంటాడట—రాత్రిళ్లు ఎక్కడెక్కడో తిరిగి ఏ తెల్లవారుజాముకో ఇంటికి వస్తాడట బాగా తాగి.'

'ఛత్—నోరుముయ్ — అబద్ధమాడినా అతికేటట్లుండాలి—రంగనాధరావేమిటి తాగడమేమిటే, తిరుగుబోతుకావడమేమిటి—ఎవడన్నా వింటే నవ్విపోతాడు.'

'అదే నేనూ అంటున్నది—మీరాయనతో ఇలా రాసుకు పూసుకు తిరుగుతుంటే లోకం నవ్విపోతుందనే నేనూ చెప్పడం' విసురుగా లోపలికి వెళ్లిపోయింది.



నేను ఆలోచనలోపడ్డాను — రంగనాధరావుతో గత సంవత్సరంగా నాకు మంచి పరిచయమే వున్నది. హైదరాబాదునుంచి చీరాలకు ట్రాన్స్‌ఫర్ అయినప్పటినుంచీ రంగరాధరావు చేదోడు వాదోడుగా వుంటూ వున్నాడు. ఇల్లు వెతికిపెట్టడంలోనూ నలుగురినీ పరిచయం చేయడంలోనూ ఎంతో సహాయపడ్డాడు. అయితే నాకు సహాయపడ్డాడు కాబట్టి ఆయనలో దుర్గుణాలేవీ లేవని అనడం కాదు కాని, చూచినంత లెక్కలో ఆయనలో దురలవాట్లేవీ కనిపించలేదు—కాఫీకూడా తాగడు—కనీసం పాన్‌కూడా నమలడు.

లైటు ఆర్పేసి పడుకున్నాను కాని నిద్ర పట్టలేదు—ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు ?

తెల్లనివన్నీ పాలని నమ్మేవాణ్ణి నేను— నిజంగా రంగనాధరావులో దుర్గుణాలున్నాయో ఏమో—ఎవరు చెప్పగలరు ??

నిప్పులేందే పొగ పుటదుకదా !

నేనేం రంగరాధరావు నిజజీవితంలోకి ప్రవేశించి చూచానా ఏమిటి ఆయన గుణస్వభావాలు.

పోనిద్దూ...లోకం ఎలా పోతే నాకేం— ఇలా అనుకున్నా నిద్రపట్టటంలేదు.

మనస్సంతా వికలమైంది.

రంగనాధరావుగూర్చి నేను ఊహించుకున్న భావచిత్రం మసక మసక పడజొచ్చింది.

ఎప్పుడు కునుకుపట్టిందో ఏమో...

* * *

మర్నాడు ఆఫీసులో రంగనాధరావు కనపడ్డాడు.

రోజూ చూచే రంగనాధరావే — అయినా ఆయనలో నాకేదో కొత్తదనం కనిపించింది.

ఆ వైలక్షణ్యం నా ఆలోచనా సరళిలోని పరివర్తనవల్ల వచ్చిందని నాకు తెలుసు.

రంగనాధరావు మటుకు మామూలుగానే మల్లెపువ్వులా నవ్వాడు.

అయితే నేనుమాత్రం దానిని ప్రతిరోజులాగా స్వీకరించలేకపోయాను.

కూర్చోని పని చేస్తున్నానే కాని మనస్సు మొత్తం రంగనాధరావు అవినీతి మీదే వుంది.

ఏదోలా సాయంత్రమైంది.

క్రి తి క్రి

'క్యాభాయ్—చెలేంగే' అంటూ హుషారుగా రంగనాధరావు వచ్చాడు.

నాకెందుకో రంగనాధరావుకు కొంచెం ఉచితంగా ధర్మబోధ చేయలనిపించిం .

ఇద్దరం సైకిళ్లు పట్టుకొని నడుస్తున్నాం—

భర్తృహరి సుభాషితాలలోనుంచి శ్లోకాలు చదివాను—

శంకరాచార్యులవారి భజగోవిందం చదివాను—

'హో జీవా ! ఏముంది స్త్రీలో— మాంసమూ చర్మమూ మొదలైన వాటి వికారమేకదా ! మళ్లీ మళ్లీ స్మరించి గ్రహించు తత్వం' అని అర్థం వచ్చే పాదాలు కొన్ని వినిపించాను.

రంగనాధరావు ఫక్కున నవ్వి 'ఈ సన్యాసులు మహా చెడ్డవాళ్లయ్యా' అన్నాడు.

'ఏం?' అన్నాను.

'మనల్ని బొత్తిగా సంసారాలు కూడా చేసుకోనిచ్చేట్లులేదు. మరీ ఇంత విచారంగా జీవితాన్ని వర్ణిస్తే బ్రతుకుమీద అసహ్యం పుట్టదూ—' అన్నాడు.

'రంగనాధరావ్ ! బ్రతుకుమీద అసహ్యం పుట్టడం కాదు—అవినీతి మీద అసహ్యం పుట్టించడం దీని పరమార్థం' అన్నాను.

'ఇంతకీ నీవు రాత్రి ఏదన్నా హరికధకో, పురాణా కాలక్షేపానికో వెళ్లి వచ్చావా ?' అన్నాడు.

'ఏమి అట్లా అడుగుతున్నావు?'

'మరేం లేదు—ఉన్నట్లుండి ఇలా వైరాగ్యమూ—ధర్మోపదేశాలూ ప్రారంభమైనాయ్ అని—' ఆత్మీయతతో నావీపు చరిచాడు.

వెన్నలా కరిగిపోయాను.

అయినా భార్య రాత్రి అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి. ఎంత అనురాగం నామీద చూపితే మాత్రమేం, ఇతనొక తాగుబోతు తిరుగుబోతు — అదిమాత్రం మరచిపోకూడదు సుమా !

'రంగనాథ్ జీ !'

'ఏం భాయ్.'

'పద మీ ఇంటికి వస్తాను.'

ఆశ్చర్యపోయాడు.

'అదేమిటి ? ఫామిలీ ఎక్కడికన్నా వెళ్లిందేమిటి ?'

ఇలా అడగడంలో ఆశ్చర్యం లేదు—అయిదున్నర కాగానే ఉరుకులు పరుగులతో ఇంటి మీద పడతాడు ప్రతి ఎంప్లాయీ— లంచ్ ఇంటర్వెల్ తర్వాతినుంచే మాకళ్లు మొత్తం గడియారపు ముళ్లకు అతుక్కొనిపోయి వుంటాయి—అలాంటిది తాపీగా వాళ్లింటికి వస్తానంటే ఆశ్చర్యపడడూ...

'భ్రష్టస్య కాలాగతిః' అని అటువీతి బోధించినట్లూ ఇటు ఏదో కూనిరాగం నాలో నేనే ఆలాపించినట్లూ అన్నాను. రంగనాధరావు విని 'ఎవడు అల్లాడో కాని భలే కధ అల్లాడోయ్' అన్నాడు.

'ఏమి?' అన్నాను.

'లేకుంటే భోజరాజు తిరుగుబోతుకావడమేమిటి—దానికి కాళిదాసు మారువేషంలో గుణపాఠం నేర్పడమేమిటి? మనవాళ్ల మనస్తత్వాలు తమాషాగా లేవూ.'

ఉలిక్కిపడి బుజాలు తడుముకున్నాను. కాని తననే ఉద్దేశించి అన్నానని తాను నన్నే ఉద్దేశించి అన్నాడా?

[ఇంతకూ ఆకధ ఏమిటంటే—భోజరాజు తిరుగుబోతుగా మారాడని తెలిసి ఆయన భార్య కాళిదాసుసహాయం కోరిందట! సరేనని కాళిదాసు మారువేషం వేసుకోని భోజరాజు వేశ్య ఇంటికి వెళ్లే దారిలో ఒక కల్లు అంగడి వద్ద నిలుచున్నాడట. ధగధగ మెరిసే బొట్టూ, జంధ్యమూ చూచి భోజరాజు 'అరే బ్రాహ్మడివి. నువ్వు కల్లు తాగుతావా?' అన్నాడట !

'లేదండీ—ఎప్పుడైనా మాంసం తిన్నప్పుడే తాగుతాను' అన్నాడట కాళిదాసు.

'అయితే నీవు మాంసంకూడా తింటావన్నమాట.'

'లేదండీ ! జూదంలో పైసలు వచ్చినప్పుడు మాత్రమే తింటాను.'

'అయితే నువ్వు జూదంకూడా ఆడుతావా?'

'లేదండీ—ఎప్పుడైనా అరుదుగా దొంగతనంలో కలిసివస్తేనే ఆడుతాను.'

'అయితే నీవు దొంగతనంకూడా చేస్తావన్నమాట.'

'చెయ్యను—నావేశ్యకు డబ్బు అవసరమైనప్పుడు మాత్రమే చేస్తాను.'

'అయితే నీవు వ్యభిచారికూడానన్నమాట.'

'చెడిపోయేవాడికి ఒకదాని తర్వాత ఒకొటి

# యామిని కృష్ణమూర్తికి ప్రియమైన కాఫీ:

# నెస్‌కాఫే!



"నృత్య కార్యక్రమంతో
అలసట చెందినప్పుడు,
నా కాఫీకోసం నేను
ఎదురుచూస్తాను.
అవును తప్పకుండా!
అది నెస్‌కాఫే-
దానితో
ఎంతో ఉత్తేజం
కలుగుతుంది."

ఆమెకు తెలుసు కాఫీకి అలవడినవారికి తెలిసినట్లు. ఇతర ఇన్‌స్టంట్ కాఫీ లన్నిటికన్న నెస్‌కాఫే విశిష్టమని దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని. అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




## నెస్‌కాఫే

నెస్‌కాఫే మిక్కిలి ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL-464-23145-TEL

కదా!' అని వెళ్లిపోయాడట కాళిదాసు.

ఇది విని భోజరాజు సిగ్గు తెచ్చుకొని దుర్బుద్ధి మానుకున్నాడని కధ.]

రంగనాధరావు ఇల్లువచ్చింది.

'ఏమేవ్—కాఫీపట్రా జల్దీ.'

'అవునండీ—కాఫీ పొడి అయిపోయిందని పొద్దున చెప్పాను—తెచ్చారా? లేదా' లోపలి నుండి సీతారత్నం వచ్చింది.

ఆమె నన్ను చూచి గుమ్మంలోనే చటుక్కున ఆగిపోయి నాలుక కరుచుకుంది—ఏదో తప్పుచేసిన దానికి మల్లే—

'అరెరె—కాఫీపొడి తేవడం మాటల సందర్భంలో మరచిపోయానే — ఇదుగో బ్రదర్...ఇప్పుడే అయిదు నిమిషాల్లో వస్తాను ఏమీ అనుకోకు' సైకిల్‌మీద తూనీగలా దూసుకుపోయాడు.

'టిఫిన్ తెచ్చిస్తాను—అన్నయ్యగారు.'

'వద్దమ్మా—ఇప్పుడు తీసుకోను.'

'అదేం—మా వదినలాగా నేను చేయలేననా?' సీతారత్నం నవ్వింది. కాని ఆ నవ్వులో ఏదో మ్లానరేఖ కన్పడింది — వెనుకటిలా కార్తీకమాసపు వెన్నెలలా లేదు. అంతేకాదు సీతారత్నం చాలా నిరలంకారగా కన్పడింది—చెవులకూ ముక్కులకూ ఏమీ లేవు. మెడలో గొలుసులేవో ఉండాలి—ఎందుకంటే క్రితం సారి నేను మా ఆవిడతో వాళ్ల ఇంటికి వచ్చినప్పుడు ఈ గొలుసులాంటిదే, తనకూ కావాలని మా ఆవిడ నాకు చెప్పడం జ్ఞాపకం వుంది.

ఇంక అనుమానం దేనికి — అవన్నీ కరిగించి తాగుడుకు ఖర్చుపెట్టివుంటాడు.

—లేక ఒకవేళ తలంటి పోసుకోవడం కోసం కూడా తీసి వుండవచ్చుగా.

'ఏమ్మా అంతా కులాసాగా వున్నారా.'

'ఏం కులాసాలేండి అన్నయ్యగారు — ఎక్కడవున్నావే గొంగళి అంటే వేసినచోటనే అన్నట్టుంది మా సంసారం.'

షాక్ తిన్నాను—లోగడ ఎన్నడూ సీతారత్నం తన సంసారాన్ని ఇంత పలుచన చేసుకోని మాట్లాడలేదు - అందులోనూ ఇతరులముందే ఇలా అంటున్నదంటే నిజంగా మనస్సులో ఎంత బాధ లేనిదే అంటుంది??

ఇంక అనుమానం దేనికి?

నా భార్య చెప్పిన మాటలకూ నేను చూస్తున్న దానికి పొత్తు కుదురుతున్నది—అంటే వచ్చిన పని అయిందన్నమాట—

## కిటికీ

ఇంక వేరే ప్రశ్నించడం దేనికి??

అయినా ఏమని ప్రశ్నించాలి కనుక!—

కాని సీతారత్నమే నోరు విప్పింది 'అన్నయ్యగారూ— మీరు నాకో చిన్న సహాయం చేస్తారా'

'ఏమిటమ్మా అది'

'మీరు మరోలా అనుకోకండి — మీకంటే ఈ వూళ్లో నాకు వేరే ఆత్మీయులు లేరు కాబట్టి ఈ మాటలు చెపుతున్నాను—దయతో మీ స్నేహితుడికి డబ్బు విలువను గూర్చి కొంచెం నచ్చ చెపుదురూ,'

'అదేమమ్మా—ఆయనకేం దుర్వ్యసనాలు లేవే— ఎందుకు డబ్బు వృధాచేస్తాడబ్బా.'

సీతారత్నం నిట్టూర్చింది—

'అది నా ఖర్మం డబ్బు పోవడానికి ఎన్నో మార్గాలున్నాయి...తాగితేనే వ్యసనమా? ఎవతెకైనా ఇస్తే వ్యసనం కాదా?'

పిడుగుపడ్డట్లయింది—

'ఎవతెకు?' అని నేను ప్రశ్నించలేకపోయాను. మౌనం కాలాన్ని మరింత బరువుగా మార్చింది.

రిలీఫ్‌కోసం దిక్కులు చూస్తున్నాను. టిఫెన్ తెచ్చేందు కనుకుంటాను సీతారత్నం లోపలికి వెళ్లింది — గుమ్మంలో పచార్లు చేస్తున్నాను.

అవతల మేడమీద ఎవరో వీణ వాయిస్తున్నారు. అది నా మనస్సును మరింత కలత బెట్టింది—సంగీతంలో ఎక్కడా ఆనందం లేదు—మాధుర్యం లేదు. ఇది నా మనోలక్షణమా? లేక వాళ్లెవళ్లో పాడుతున్న అపాటే అలా వుందా??

ఏమో మరి—

రంగనాధరావువచ్చాడు —

'ఏం బ్రదర్—రాధగారి సంగీతం వింటున్నావేమిటి – రా, రా, కాఫీతాగేద్దాము. ఇదుగో టిఫిన్ ఇవ్వలేదా, ఇంకా, ఏమిటే మీ అన్నయ్యకు.'

రంగనాధరావు ఆప్యాయత మొత్తం అసహ్యంగానే కన్పించసాగింది నాకు!

నాకు టిఫిన్లు ఇచ్చి కల్లబొల్లి కబుర్లు చెప్పినంత మాత్రాన సంతోషిస్తాననుకున్నాడేమో—కారక్టర్ లేకపోతే ఇంకెందుకీ దోస్తీ!

సీతారత్నం టిఫెనూ, కాఫీ ఇచ్చింది. అయిష్టంగానే తీసుకున్నాను.

కిటికీనుండి విషాద సంగీతం!

'గురూ— మ్యూజిక్ ఎలాగుంది— మజాగా లేదూ-'

కాఫీ చప్పరిస్తూ అన్నాడు రంగనాధరావు.

'ఎవరేమిటి పాడేది' ఏదో అనాలిగా మరి—అన్నాను.

'సీతాపతిరావు లేడూ అదేనయ్యా—బ్యాంక్ కాషియర్ సీతాపతిరావు– ఆయన భార్య—వోహ్! బ్రహ్మాండంగా వాయిస్తుందిలే – అమర సంగీతం......ఏమేవ్ – కాఫీ మరీ కషాయంలా కాచావేమిటి కొంచెం పంచదార పట్రా—సారీ బ్రదర్ ఏమనుకోకు–' నావంతుకూడా తానే మాట్లాడుతున్నాడు—

'సీతారత్నం మరో స్పూను పంచదార తెచ్చి కలిపింది—అయినా సరే కాఫీ నా మనస్సుకు విషంలా వుంది—

'వస్తాను రంగనాధం ఇప్పటికే చాలా ఆలస్యమైంది' అంటూ లేచాను.

రంగనాధరావు హుషారుగా వీడ్కోలు చెప్పాడు — సైకిలెక్కి ఇల్లుచేరాను —

'ఏమండీ—ఇంత ఆలస్యమైందే—' గుమ్మంలోనే ప్రశ్న!

'....................'

'ఎక్కడికి వెళ్లారేమిటి?'

మాట్లాడకుండా సైకిలును లోపల పెట్టి లాక్ చేస్తున్నాను—

'ఆ రంగనాధరావుగారింటికిపోయారా?'

'ఏం—పోతే ఏం?'

'నేననుకుంటూనే వున్నాను— అవ్వ' అని నోటిమీద చెయ్యివేసుకొని 'అతనితో స్నేహం మానమని నేను నెత్తిమీద నోరుపెట్టుకోని చెపుతున్నాను—వింటేనా? చివరకు మిమ్మల్నో తాగుబోతుగానో మండలముతాకోరుగానో చేసి కాని వదిలేటట్లు లేడా ప్రబుద్ధుడు – '

'చాల్లే నోరుముయ్.'

నా ఆవేశానికి కళ్లనీళ్లు పెట్టుకోని నిజంగానే నోరుమూసుకొని వెళ్లిపోయింది—

ఇకమీద రంగనాధరావుగారింటికి పోకూడదని అనిపించింది ఆఫీసులో కనపడ్డా మాట్లాడకూడదు...

రాత్రి నిద్రపోయేవరకు మా ఆవిడ సణుగుతూనే వుంది—

ఈవిడ నిక మహిళామండలికి పోనివ్వ

కూడదని అనుకున్నాను —

ఏవో కుట్లూ, అల్లికలూ నేర్చుకుంటుంది లెమ్మని కాలక్షేపానికి పొమ్మని చెపితే చివరకు ఇలాంటి దెబ్బలాటలు తెస్తున్న దేమిటి??...

ఎలాగో ఆరాత్రి గడిచింది—

అలాగే వో వారంరోజులుకూడా గడిచాయి. ఈ లోపల మళ్ళా కొన్నివార్తలు — కొంత సమాచారం—

రంగనాథరావు ఎవరో అమ్మాయితో ధియేటర్‌లో కన్పించాడట !'

తాగి తూలుతున్నట్లు నడుస్తున్నాడట !

'ఇదుగో లక్ష్మీ! నాకికమీద రంగనాథరావుగూర్చి మీ మహిళామండలి సమాచారం ఏదన్నా ఇంట్లో అందించావంటే నామీద ఒట్టు' గట్టిగా మందలించాను.

లక్ష్మిని మందలించానే కాని నా మనస్సు మాత్రం వికలమైపోయింది — రంగనాథరావుతో వెనుకటి ఆత్మీయిత చూపడం లేదు

అకారణంగా నేనెందుకిలా ప్రవర్తిస్తున్నానో తెలియక రంగనాథరావు మథనపడుతున్నట్లు నేను గ్రహించాను.

అయినా నేనేం చేయగలను ?

సాధ్యమైనంతవరకు తప్పుకోని తిరగసాగాను.

ఆనాడు ఆదివారం—ఎక్కడికీ పోకుండా ఇంట్లోనే వున్నాను.

రంగనాథరావు వచ్చాడు — తాగినవాడికి మల్లే కళ్ళు ఎర్రగావున్నాయి.

సభ్యతకోసం 'రమ్మని' ఆహ్వానించాను.

'బ్రదర్—అర్జంటుగా డబ్బు కావాలి.'

'ఎంత ?' అనబోయి 'ఎందుకు ?' అని మాత్రం అన్నాను.

'కారణం తర్వాత చెప్తాను — వో వంద వుంటే చూడు.'

'అదేమిటి నీ కళ్లలా ఎర్రగా వున్నాయి తాగినలాడి కళ్ళలాగా' కాలాలనే అన్నాను.

పేలవంగా నవ్వాడు రంగనాథరావు

'ఔను — తెల్లవార్లూ నిద్ర లేదు.'

'ఎందుకని ?'

'సుజాతకు ఒంట్లో ఏమీ బాగుండలేదు'

'....................'

'సుజాత ఎవరు ?'

'మా చెల్లెలు.'

నివ్వెరపోయాను — రంగనాథరావు కొక చెల్లెలు వుందని నాకిదే మొదటిసారి తెలియడం — అమాటే పైకి అన్నాను.

ఈ లోపల లక్ష్మి లోపలనుండి వచ్చి మమ్మల్ని చూచింది.

రంగనాథరావు గౌరవ సూచకంగా నమస్కరించాడు.

లక్ష్మి మర్యాదకోసం ప్రతి నమస్కారం చేసి లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె నడక చూపుపట్టి నేనేదో కూడని పని చేస్తున్నానని వాకౌట్ చేసినట్లు అనిపించింది.

'ముందు డబ్బు తీసుకురా — తర్వాత చెపుతాను'

ఆ మాటలో వున్న మంత్రశక్తి ఏమిటో నాకు తెలియదు. కాని యాంత్రికంగా బీరువా వద్దకు వెళ్ళి పది పదులు లెక్కబెట్టి జేబులో పెట్టుకొని చొక్కా తగిలించుకొని బయలుదేరాను.

నేను చేస్తున్న పనిని మా ఆవిడ నిశ్చేష్టురాలై గుడ్లప్పగించి చూస్తున్నది.

రంగనాథరావును వెంబడించాను.

ఇరువురం నిర్మానుష్యంగా వున్న దారి నుండి నడుస్తూ వెళ్తున్నాము.

రంగనాథరావు తన స్వంత కథ మొదలు పెట్టాడు. — నేను వింటున్నాను — రంగనాథరావు ఆ కథను ఎలా చెప్పాడో నేను మీకు చెప్పలేను — ఎందువల్లనంటే ఇదొక విచిత్రమైన కథ. రంగనాథరావు తండ్రికి సంబంధించిన కథ — రంగనాథరావు తండ్రి ఎప్పుడో చేసిన తప్పుఫలితంగా సుజాత ఎవరికో జన్మించింది — అయితే ఆ విషయం ఎవరికీ తెలియదు — తండ్రి చనిపోతూ రంగనాథరావుకు ఆ విషయం చెప్పి మరీ వెళ్లాడు. అప్పటినుంచి రంగనాథరావు సుజాతగూర్చి శ్రద్ధ వహించడం మొదలు పెట్టాడు — సుజాత తల్లికూడా చనిపోయింది — అనుకోకుండా సుజాతకు ఇటీవల చీరాల ట్రాన్స్‌ఫర్ అయింది. అప్పటినుంచి సుజాత యోగక్షేమాలు తానే స్వయంగా చూస్తున్నాడు — సుజాతకు టి. బి. దానికై రంగనాథరావు డబ్బంతా హారతి కర్పూరంలా హరించుకొని పోతున్నది — ఈ కథను ఎంతో సభ్యతగా సంస్కారవంతంగా సూటిగా చెప్పాడు రంగనాథరావు నాకు.

'వస్తావా మా చెల్లెలును చూద్దాము.'

'ఇప్పుడు కాదు మరోసారి వస్తాలే...'

'సరే — నేను మళ్లీ కలుస్తాను నిన్ను' రంగనాథరావు వెళ్లిపోయాడు.



ఇప్పుడర్థమైనాయి సీతారత్నం మాటలు 'ఎవతెకో డబ్బు ఇవ్వడమంటే' — అంటే ఆమెకూ తెలుసునన్నమాట సుజాత రంగ నాథరావు చెల్లెలని—మరి ఈ అపార్థాలను కల్పించిందెవరు??

లక్ష్మిమీద నాకు బాగాకోపం వచ్చింది—

దురుసుగా ఇంట్లోకి ప్రవేశించాను. లక్ష్మి ఏడుస్తూ పడుకోని వున్నది.

వందరూపాయలు తగలేశానని ఏడుస్తున్నదని నాకు తెలుసు.

మెల్లగా అనునయిస్తూ నేను విన్న కథ నంతా లక్ష్మికి ఏకరువుపెట్టాను.

లక్ష్మి అలా తలవంచుకోని వింటూ వున్నది.

'చెప్పు లక్ష్మి—రంగనాథరావు ఎంతటి ఉదాత్తుడో–కేవలం నైతికమైన ఏదో బాధ్యతకోసం తను మానధనాలను అర్పిస్తున్న అతని మంచితనం ఇప్పటికైనా నీకు అర్థమైందా?'

లక్ష్మి ఏమీ జవాబు చెప్పలేదు—అయి ఇటువంటి పరిస్థితిలో ఎవరైనా అనుమాన పడటంలోకూడా తప్పులేదుకదా !! కాని వో రెండురోజులు అకారణంగా పలకడం మాత్రం మానివేసింది—

నామీద కోపం కావచ్చు లేక తాను చేసిన తప్పుకు ముఖం చెల్లకకావచ్చు—

ఆ రెండురోజులతర్వాత మళ్లీ మెల్లగా మాటలు మొదలుపెట్టింది మామూలుగానే!

నేనూ లక్ష్మి తప్పుచేసినట్లు భావించ లేదు—

ఇలా వుండగా ఒకనాడు ఆఫీసు నుంచి ఇంటికి రాగానే కాఫీ అందిస్తూ చెప్పింది 'ఇది విన్నారా—'

'ఏమిటి?'

'వాళ్ల సదాశివరావులేడూ అదేనండీ వెంకటరంగంగారి కొడుకు.'

'ఆ—ఆ—'

'అతడు ఎం. డి తప్పాడట— బోడిగొప్ప వెంకటరంగం ఇంకా కొడుకును కౌలా లంపూర్ పరీక్షకు పంపి స్టేట్స్‌కు పంపా

## కిటికీ

లని చూస్తున్నాడు—'

'ఎవరు చెప్పారు?'

'రాధ చెప్పింది.'

'ఏ రాధ?'

'అదే కాషియర్ సీతాపతిరావుగారి భార్య.'

'ఏదీ మన రంగనాథరావుగారింటి పైన మేడలో అద్దెకుంటున్నారు—'

'ఆ—వాళ్లే—ఆమె మా మండలి సభ్యురాలు.'

నేనేదో తీవ్రంగా ఆలోచిస్తున్నాను.



'పాపం రాధ చాలా మంచిదండీ — కాని ఆమె దురదృష్టం— ముసలి మొగుడు దొరికాడు.'

'అంటే...'

సీతాపతిరావుకు చాలా డబ్బు వుందండీ— రాధ, రెండో సంబంధం — కేవలం డబ్బు చూచి రాధ తండ్రి కూతురిగొంతు కోశాడు—సీతాపతిరావు బి. కాం ఫెయిలు అయినాడు—అయినా అనుభవంమీద కాషియర్ అయినాడు.'

'లక్ష్మి—లక్ష్మి—' ఆవేశంగా లక్ష్మి రెండు బుజాలూ పట్టుకొని వూపాను.

'ఏమిటండీ' తెల్లబోయి అడిగింది—

'నీకు రంగనాథరావు కథ చెప్పిందెవరు?'

'రాధే చెప్పింది—'

'మొన్న ఉదయాస్టోర్స్‌వాడు దుకాణానికి వచ్చిన ఎవతెతోనో సరసాలాడి తన్నులు తిన్నాడని వార్తతెచ్చావే అదెవరు చెప్పారు?'

'రాధే......ఎందుకండీ...'

'హోహ్హో...........' పెద్దగా కేక పెట్టాను.

'ఏమిటండీ—ఏమయింది—'

'ఏమీలేదు నీ వింట్లోకి పో.'

లక్ష్మి నావైపు అయోమయంగా చూస్తూ వెళ్లిపోయింది.

రంగనాథరావును గూర్చి కొద్ది రోజులైనా తప్పుగా భావించినందుకు ఎందుకో అతనికి క్షమాపణ చెప్పుకోవాలని మనస్సు పరితాప పడింది — కాఫీగ్లాసు కింద పడేసి అలాగే చకచక నడుచుకుంటూ రంగనాథ రావు ఇల్లుచేరాను — రంగనాథరావుగారి గుమ్మంలో నిలబడేసరికి, ఆ ఇంటి పక్కనే సీతాపతిరావుగారి మేడమీద నుండి మళ్లీ సన్నని సంగీతం వినపడుతోంది.

తల పైకెత్తి చూచాను.

మేడమీద కిటికీ పక్కనే రాధ కూర్చొని వున్నది—సన్నగా సంగీతం ఆలాపిస్తున్నది— ఆమె మనస్సు అనే కిటికీనుండి శబ్దాలూ స్వరాలూ అలా, అలా, గాలిలోకి తరంగాల్లా వ్యాపిస్తూవున్నాయి. ●

# సినిమా బ్యూటీ బులెటిన్

### లేక

# అందానికి చిట్కాలు

**అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది. వ్యక్తిగత మయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No. 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.**

ప్ర : నా ముఖం నిండా మొటిమలు లేచాయి. అవి కనిపించకుండా దళసరిగా మేకప్ వేసుకుంటూ వుంటాను. ఇది చర్మానికి హానికరమా ?

జ : దళసరిగా మేకప్ వేసుకోవడం చర్మానికి హానికరమని వేరే చెప్పాలా? దళసరిగా మేకప్ చెయ్యడంవల్ల చర్మంలో నుంచి విడుదలయ్యే సహజ సిద్ధమైన నూనెలు, ఏసిడ్‌లూ బయట పడ్డానికి అవకాశం వుండదు. ఇలాచేస్తే కొద్ది రోజుల్లోనే మీ సౌందర్యం పాడవుతుంది.

ప్ర : వెంట్రుకలని 'డ్రయ్ — క్లీన్' చెయ్యవచ్చునని ఎక్కడో చదివాను ... అది ఎలా ?

జ : వెంట్రుకలను శుభ్రం చెయ్యడానికే మరొక పేరు 'డ్రయ్ క్లీనింగ్' ప్రతిసారీ తలస్నానం చెయ్యడానికి బద్ధక మయ్యేవారికి— మృదువైన వెంట్రుకలుండే వారికి — అవి అస్తమానం జారి ముఖంమీద పడేవారికి ఈ పద్ధతి మంచిది. చెయ్యడం చాలా తేలిక. వెంట్రుకలు పాయలుగాచేసి బ్రష్‌తో చిక్కులు లేకుండా శుభ్రంగా క్రిందికి దువ్వాలి. వెంట్రుకల్లో మట్టి పోయేవరకూ అలా నెమ్మదిగా దువ్వాలి. బాగా దువ్విన వెంట్రుకలను పాయలుచేసి 'విచ్ హేజెల్' రాయాలి. రాసి, బాగా ఆరనివ్వాలి. ఈ పద్ధతివల్ల వెంట్రుకలు పూర్తిగా శుభ్రం కావు. కాని, మళ్లీ షాంపూతో స్నానం చేసేవరకు బాగా వుంచుతుంది.

ప్ర : చేతులతో పోల్చుకుంటే నా మోచేతులు నల్లగా బిరుసుగావుంటాయి. వాటిని మృదువుగా రంగులో కలిసిపోయేలా చెయడానికి ఏమైనా పద్ధతి వుందా?

జ : మంచి నరిషింగ్ క్రీమ్‌తో వాటిని బాగా రుద్దాలి. స్నానం చేసేప్పుడుకూడా ప్రత్యేక శ్రద్ధతో తోమాలి. మోచేతులమీద బరువుగా ఆనడం తగ్గించాలి. గరుగ్గావుండే బల్లలు, గోడలమీద అసలు ఆనకూడదు. నిమ్మపండును రెండుగా కోసి రసం పిండేసిన డొక్కలతో బాగా రుద్దితే కొంతవరకు ఫలితం కనిపిస్తుంది. కాని, చేతుల రంగుతోమాత్రం పోల్చుకోవద్దు. మోచేతులమీద చర్మం గట్టిగా వుండటం రంగుమారి వుండటం సహజం.



ప్ర : 'చురీదార్స్' ఇప్పటి ఫాషన్‌కాదు. అయినా, వాటిని ధరించడమంటే నాకు సరదా. బహుశా, మా టైలరుకి తెలియక పోడంవల్ల ననుకుంటా — చీలమండలదగ్గర బాగా లూజయినా అవుతాయి. బాగా పట్టేసినట్టయినా వుంటాయి. బటన్స్ పెట్టడం నా కిష్టముండదు. సరిగ్గా పెరిపోడానికి ఏం చెయ్యాలి ?

జ : టైలరు పనితనమంతా కత్తిరించడంలో వుంటుంది. చివరి మూడు అంగుళాల కత్తిరింపులోనూ చీలమండలు పట్టెయ్యకుండా జాగ్రత్తగా తీసుకోవాలి. ఇంకా కష్టమనిపిస్తే—నైలాన్ సాక్స్ ధరించి—ఆపైన వాటిని వేసుకోవచ్చు.

ప్ర : 'క్రీమ్ పెర్‌ఫ్యూమ్' అంటే ఏమిటి? మామూలు సెంటులకీ దీనికీ తేడా ఏమిటి ?

జ : మామూలు సెంట్లు ద్రవ రూపంగా వస్తాయి. క్రీమ్ రూపంలో వచ్చే దాన్నే 'క్రీమ్ పెర్‌ఫ్యూమ్' అంటారు. రెండింటికీ పెద్ద తేడా అంటూ ఏమి లేదు. కొన్ని కంపెనీలు రెండువిధాలుగానూ తయారు చేస్తాయి. ట్యూబ్స్‌లో రావడంవల్ల కోల్డ్ క్రీమ్ అనిపిస్తుంది, వ్యక్తిగతంగా—నేను స్ప్రే కంటే కూడా క్రీమ్ పెర్‌ఫ్యూమ్‌నే ఇష్టపడతాను. వంటిమీద అది ఎక్కువసేపు నిలుస్తుంది. ●

# సినిమా

## మంచికే కష్టాలా!

అంటున్నారు, 'కన్నకొడుకు' చిత్ర నిర్మాత, రాధాకృష్ణమూర్తిగారిని ఉద్దేశించి ఆయన చాలా మంచివాడు తను, తన పని, తన ఆఫీసు తప్ప మరొక సంగతిని ఆలోచించని వ్యక్తి అందరూ - బాగుండాలి అన్న ఆశ, ఆశయం వున్న మనిషి

అలాంటి మంచి మనిషికి ఎంత కష్టాన్ని యిచ్చాడు మనల్ని సృష్టించిన దేముడు 'కన్నకొడుకు' చిత్రం యింతగా దెబ్బతిన వలసిన చిత్రం కాదు. కానీ, తిన్నది

చిత్రం నిరాశను కలిగించడానికి కారణం తెలుసుకుందామని నెల్లూరు వెళ్ళి, థియేటర్లో కూర్చున్నాను

'ఇది పాత కథలాగుంది అని కొందరు, పాటలు ఎక్కువైనాయని కొందరు, నాగేశ్వరరావుగారు యీ పాత్రను పోషించడం ఏమిటి? అని కొందరు వ్యాఖ్యానించడాన్ని చెవులారా విన్నాను. రెండవ సగంలో తల్లికి, తనయుడికి కొన్ని డ్రెమెటిక్‌సీన్లు పెట్టియుంటే కొంత మెరుగ్గా వుండేది. ఏ పాటకూ సన్నివేశప్రాధాన్యత లేదు' అన్నారు హైక్లాసు ప్రేక్షకులు

ఇటీవల నటసామ్రాట్ నటించిన చిత్రాల్లో 'బీదలపాట్లు' తర్వాత బాగా దెబ్బ తిన్న చిత్రం యిదేనేమో

నిర్మాత మంచితనంకోసం అయినా, భగవంతుడు మంచి ఫలితాన్ని యిచ్చివుండొచ్చు బెటర్ లక్ నెక్స్‌ట్ టైమ్.

## ఆమె ఎంత బాగా చేసింది...

అన్నారు 'శారద' చిత్ర నాయిక శారదను ఈమెలో యింత నటనా శక్తి వున్నదా అన్నారు కొందరు ఆమెలాగా నాచురల్‌గా నటించే వాళ్ళు వున్నారా అన్నారు మరికొందరు. దర్శకుడు విశ్వనాథ్ గారు ఆమెను ఎలా నటింపచేశారు అని ఎందరో అన్నారు.

'శారద' చిత్రాన్ని అందరూ మంచి చిత్రంగా ఆదరిస్తున్నారు. క్లాసు, మాసు అన్న తారతమ్యం లేకుండా

15—6—73



'తల్లీకొడుకులు'లో కృష్ణ, కాంచన



జగమేమాయ'లో సునందిని

యీా చిత్రాన్ని వీక్షిస్తున్నారు ముఖ్యంగా మహిళలు యీా చిత్రానికి మొదటి మార్కు లిస్తున్నారు. ఇంత ఉత్తమ కథ వస్తువుగొన్న చిత్రాన్ని నిర్మించిన రాఘవ రావును అభినందిస్తున్నారు

మళయాళంలో మహా నటి అనిపించు కుంది అదే భాషలో వుత్తమంగా నటించి నందుకుగాను ఊర్వశి బిరుదును అందు కుంది తర్వాత 'మనుషులు మారాలి' చిత్రం విడుదలైంది అప్పుడే మనవాళ్ల దృష్టి ఆమెపై పడింది అయినా సరైన పాత్రలకు ఆమెను ఎవ్వరూ తీసుకోలేదు

ఇటీవల వచ్చిన 'కాలం మారింది' శారద నటజీవితంలో కొత్త ఆశను చిగురింప చేసింది 'శారద' చిత్రం ఆమె నటనా శక్తికి సవాలుగా నిలబడింది 'జీవితం' తో ఆమె సినిమా జీవితం వున్నత దశ నందు కుంది

1973 వరకు తీసుకుంటే, శారద మొదటి శ్రేణిలో నిలబడుతుంది ఆమె చేస్తున్న కృషి ఆమెకి మంచి నట జీవి తాన్ని ప్రసాదించింది.

## మొదటి చిత్రం

నటి శారద మేటి కథానాయకులందరితో జంటగా నటించింది మళయాళంలో స్వర్గీయ సత్యన్, నజీర్, మధు, తమిళంలో శివాజీ, ఎం జి ఆర్, తెలుగులో ఎన్టీ ఆర్, శోభన్, కృష్ణ, హిందీలో సంజీవ కుమార్‌గార్లతో నటించియుంది, భార్య గానో, ప్రేయసిగానో లేక ప్రేమించి త్యాగం చేసిన యువతిగానో.

కానీ యింతవరకు నాగేశ్వరరావుకి భార్యగా నటించలేదావిడ ఇప్పుడు ఆ యిద్దరూ కలిసి నటించడం జరుగుతూంది, అనంతలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ప్రేమలు— పెళ్ళిళ్ళు' చిత్రంలో. ఈ చిత్రాన్ని దగ్గు పాటి భాస్కరరావు నిర్మిస్తున్నారు

'అదృష్టజాతకుడు' మరేష్ రామా నాయుడు యీా చిత్రానికి మూలవిరాట్ లాంటివాడు ఆయన పర్యవేక్షణలో జూన్ మొదటివారం యీా చిత్రం షూటింగు ప్రారంభమవుతుంది. ఈ చిత్రానికి వీరమాచ నేని మధుసూదనరావు దర్శకుడు.



'స్నేహబంధం'లో కృష్ణ, జమున.



బికినీలో బహుభాషా మోడల్‌సుందరి మార్ని కాహిల్. ఉత్తరలండన్‌కి చెందిన ఈ అమ్మాయి అనర్గళంగా ఆరుభాషలు మాట్లాడుతుంది.



'నిండుకుటుంబం'లో అంజలీదేవి, విజయలలిత, జమున.



'రాముడే దేముడు'లో వాణిశ్రీ, విజయలలిత.

# సినిమా

## గ్లామర్ క్వీన్ !

ఇదే చిత్రలో రోమాంటిక్‌హీరో సరసన గ్లామర్ క్వీన్ జయలలిత నటిస్తూంది. ప్రధానపాత్రలను ఎస్వీ రంగారావు, రాజబాబు, జి వరలక్ష్మి, గీతాంజలి, లీలారాణి, అనూరాధ, నిర్మల మరియు రాజసులోచన పోషిస్తున్నారు

## అన్నపూర్ణా విడుదల !

'ప్రేమలు— పెళ్ళిళ్ళు' కథను మాదిరెడ్డి సులోచన వ్రాశారు ఆచార్య ఆత్రేయ మాట, పాటలను వ్రాస్తున్నారు సంగీతాన్ని విశ్వనాథన్, ఛాయను సెల్వరాజ్, కూర్పును మార్తాండ్ నిర్వహిస్తున్నారు ఈ చిత్రం సెప్టెంబరుకల్లా రెడీ అవుతుంది విడుదల ఎప్పుడవుతుందో అన్నపూర్ణా వాళ్లకే తెలియాలి.

## వంగచిత్రం ఆఫర్

మన తెలుగు ఆడపడుచు, మళయాళ దేవత అయిన ఊర్వశి శారదకు వంగ చిత్రంలో నటించే అవకాశం వచ్చింది. మృణాల్‌సేన్ యీ ఆఫర్ నిచ్చారు, నిచ్చారు.

ఈమె నటించిన, హృషీకేష్ దర్శకత్వం వహించిన 'అగ్నిరేఖ' చిత్రం త్వరలో విడుదల కాబోతుంది. బొంబాయి వాళ్లంతా శారద వర్కు సుపర్బ్ అని మెచ్చుకొన్నారు.

హిందీలో అంగీకరించ దలిస్తే, అరడజను ఆఫర్లు వున్నాయి, శారదకు. కానీ ఆమెకు మళయాళం, తెలుగు భాషలకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలని వుంది.

హిందీలో 'మృత్యుబంద్' అన్న చిత్రాన్ని మాత్రం అంగీకరించింది. హీరోయిన్‌కి ప్రాముఖ్యం వున్న కథ అది అని తెలిసింది. మొత్తానికి నాలుగు భాషల్లోనూ 'నాచురల్ నటి' అన్న పేరును ఆర్జించుకుంది, శారద.

## నాలుగవ విజయం

యావద్భారతం గర్వించదగ్గ మహానటులు మన నాగేశ్వరరావు, రామారావు గార్లు. ఇద్దరూ ఎప్పటికప్పుడు ప్రత్యేకతను కనబరచబట్టే, యిప్పటికీ ఆంధ్రుల అభిమాన నాయకులుగా వుండగలుగుతున్నారు

ప్రముఖ నిర్మాత డి వి ఎస్ రాజాగారి 'ధనమా ?దైవమా ?' చిత్రంలో నటరత్న వకీలు రామచంద్రరావు పాత్రలో రత్నంలాంటి నటన్ను చూపెట్టారు ఎంత వుదాత్తమైన నటన, ఎంత వున్నతమైన పాత్రపోషణ ఆ పాత్రను ఆయన పోషించ లేదు పాత్రగానే మారి నటించారు మనం వకీలు రామచంద్రరావును చూడగలమేగాని, రామారావును కాదు ఇదే పాత్రను మరెవ్వరూ ముట్టుకొన్నా, ఇంతే సంగతులు అయి వుండేది తానొక 'గ్రేట్ హీరో' అని మరొకసారి ఋజువు చేశారు, 25 ఏండ్ల నటుడు (1949 నుండి 1973 వరకు 24 ఏండ్లు నిండాయి)

## సినిమా

నందమూరికి యిది నాలగవ విజయం 'బడిపంతులు, డబ్బుకు లోకం దాసోహం, దేశోద్ధారకులు, ధనమా ? దైవమా ?' చిత్రాలను పరికిస్తే, ఎంత వైవిధ్యమున్న పాత్రలను ఆయన పోషించారో బోధ పడుతుంది

## తాతమ్మ కల

ప్రేక్షక జనరంజకంగా చిత్ర నిర్మాణం చేసే సంస్థల్లో ఎన్ ఏ టి ఒకటి ఈ సంస్థద్వారా వచ్చిన చిత్రాల్లో 90 శాతం ప్రజాదరణ పొందినవన్న విషయం మీకు వేరే చెప్పాలా ?

ఈ సంస్థ 'తాతమ్మ కల' పేరిట ఒక సాంఘిక ప్రయోజనం గొప్ప చిత్రాన్ని నిర్మించబోతూంది కథను రామారావు వ్రాశారు మాటలను డి వి నరసరాజు రచించారు సినిమా అనుకరణ చెయ్యడంలో ఎన్టిఆర్ ఎక్స్‌పర్ట్ గనక ఆయనే వ్రాశారు

*రాజేశ్వర్రావు ..*

'తాతమ్మ కల' చిత్రానికి నందమూరి తారకరామారావు దర్శకుడు ఈ చిత్రానికి సాలూరి రాజేశ్వర్రావు సంగీత సారథి

*ఇద్దరబ్బాయిలు ..*

తండ్రిగారి దర్శకత్వంలో, ప్రధాన పాత్రలను పోషించే అవకాశం, అదృష్టం, రామారావుగారి తృతీయ కుమారుడు చిరంజీవి హరికృష్ణకు, అయిదవ అబ్బాయి చిరంజీవి బాలకృష్ణకు లభించింది

చిరంజీవి హరికృష్ణ లోగడ రెండు చిత్రాల్లో నటించియున్నారు ఇటీవల వీరికి వివాహం అయింది

'నాలుగు తరాలకు సంబంధించిన కథ యిది' అన్నారు నటరత్న

## వాడే వీడు

ఈ చిత్రం శ్రీ గౌతమ్ పిక్చర్స్ రామబ్రహ్మం నిర్మిస్తున్నారు ఈ కథను డి వి. నరసరాజు వ్రాశారు ఇలాంటి కథకోసం 'ఆలీబాబా' తర్వాత రెండు ఏండ్లు అగారు నిర్మాత అన్ని హంగులు వుండే చక్కటి, చిక్కటి కథను తయారు చేశారు, నరసరాజుగారు మాటలు, సినిమా అనుకరణ కూడా ఆయనే చేశారు ఈ చిత్రానికి డి యోగానంద్ దర్శకుడు

వీరు యిప్పటివారా ? ఎన్ని హిట్ చిత్రాలను వీరు అందించియున్నారో మీకు తెలియదా ? ఇటీవలకూడా 'డబ్బుకు లోకం దాసోహం' వచ్చింది గదా ?

'వాడే వీడు' రెండు షెడ్యూల్సు జరిగింది, యిప్పటికి ఊటీలో పది రోజుల డ్యూటీ జరిగింది, యీ చిత్రానికిగాను ఎన్టీ రామారావు, మంజుల పాల్గొన్న రెండు పాటల చిత్రీకరణ జరిగింది

*సత్యం శపథం!*

ఈ చిత్రానికి సత్యం సంగీత దర్శకుడు



'పల్లెటూరిబావ'లో నాగేశ్వరరావు

శ్రీ రామారావు నటించే చిత్రానికి సంగీత సారధ్యం వహించడం యిదే ప్రథమం. "అన్ని పాటలు హిట్ అయ్యేవిధంగా కష్ట పడతాను,' అని శపథం చేశాడు సత్యం. ఇంతవరకు చేసిన రెండు పాటలు అతగాడు అన్న పద్ధతిలోనే హిట్ అయ్యేట్టు వచ్చాయి. ఈ చిత్రానికి ఎస్. ఎస్. లాల్ ఛాయను, వెంకటరత్నం నిర్మాణ వ్యవహారాలను నిర్వ హిస్తున్నారు. ముఖ్యపాత్రలను నాగభూషణం, పద్మనాభం, అల్లురామలింగయ్య, పండరీ బాయి పోషిస్తున్నారు. నిర్మాతద్వారా పంపిణీ అవుతుందీ చిత్రం.

## ఒక చిత్రంలో ఎందరో పెద్దలు !

జానపద చిత్రాలకు గిరాకీని ఏర్పరచిన వ్యక్తి ఎవరు ? విఠలాచార్య గారే. జానపదా లకు డిమాండ్ వున్న రోజుల్లో దర్శకుల్లో విఠలాచార్య తీసుకొన్న డబ్బు మరెవ్వరూ తీసుకోలేదు,

కాలం మారింది. జానపదాలపై ప్రజలకు విసుగు జనించింది. విఠలాచార్యను యిప్పటికీ అడుగుతున్నారు, జానపం చేసి పెట్టమని. కానీ, అయనే అంగీకరించడం లేదు.

ఇప్పుడాయన ఒక సముజ్వల సాంఘికాన్ని నిర్మిస్తున్నారు. ఈ కథ తమిళంలో, హిందీలో బాగా ఆడింది. తెలుగు చిత్ర కథానాయకుడిగా ఎన్టీ రామారావు నటి స్తున్నారు.

ఈ చిత్రంలో రామారావుతో బాటు ఎస్వీ రంగారావు, కాంతారావు, రాజబాబు, జయలలిత, అంజలీదేవి, విజయలలిత, సత్య నారాయణలాంటి పెద్దలందరినీ పెట్టారు, ఆచార్య.

*జూన్ ప్రారంభం !*

ఈ చిత్రానికి బొల్లిముంత మాటలను, మహదేవన్ సంగీతాన్ని సమకూరుస్తున్నారు. జూన్ మూడవ వారంనుండి షూటింగు ప్రారంభం. ఈ చిత్రం ఆంధ్రాలో విజయా, సీడెడ్‌లో బలరామ్, నైజాంలో శ్రీ తారకరామ ద్వారా విడుదలవుతుంది.

## అద్భుతమైన నటన...

గత వారం నటసామ్రాట్ నటించిన 'కనిపించే దేముడు' చిత్రాన్ని (కొంత భాగం) చూశాను

జీవితమంతా త్యాగాలతో నిండిన వుదాత్త మైన పాత్ర ఆయనది. తనకంటూ ఏదీ కోరడు ... తను ఏ త్యాగానికయినా సిద్ధ మవుతాడు. 'త్యాగమూర్తి' గా అక్కినేని అద్భుతంగా నటించారు. అనేక ఘట్టాల్లో మనచేత కన్నీరు కార్పిస్తుంది ఆయన నటన. 'దేవదాసు, బాటసారి' నాగేశ్వరరావు యింకా వున్నాడు, అంతకన్నా మిన్నగా నటించగలడు అన్న అభిప్రాయాన్ని కలిగించే అపురూప మైన పాత్ర, అపూర్వమైన నటన. నటు డిగా ఆయనకిది కలికితురాయి అవుతుంది.

ఇవన్నీ అతిశయోక్తులు కావు. చిత్రం చూసినప్పుడు ఏర్పడిన అనుభూతిసారం. 'జీవన తరంగాలు' లో వచ్చిన పేరును, తాతినేని రామారావు ఇంకా ఎక్కువగా పెంచుకుంటారు, యీ చిత్రంద్వారా. ఆత్రేయ...ఆత్రేయే ... ఆయనకు మరొకరు సాటిరారు, పోటీ పడలేరు అని నిరూపించే చిత్రమే 'కనిపించే దేముడు '

'జీవితం' ప్రసాదించిన యశస్సును జయంతి, మరింతగా పెంచుకొనేందుకు యీ చిత్రంలో పాత్ర దారి చూపిస్తుంది. ఇది ఎన్. ఎన్. భట్ నిర్మించిన చిత్రమూ (కత్తుల రత్తయ్య) అనిపిస్తుంది. అన్న పూర్ణా విడుదల.

## 'పల్లెటూరి బావ'లో 'పిలక బావ !'

ప్రజామన్నన అందుకొన్న మరొక సంస్థ పి. ఏ. పి. ఈ సంస్థ నిర్మించిన 'ఇల్లరికం



'నేరము–శిక్ష'లో భారతి.

భార్యాభర్తలు, కులగోత్రాలు, పునర్జన్మ' ఎప్పటికీ మరువలేనివి.

ఇప్పుడు అవి విడుదలయిన చోటల్లా, విజయవంతంగా ప్రదర్శింపబడుతూ వున్నాయి. పి. ఏ. పి. అధినేత ఏ. వి. సుబ్బారావును పరిశ్రమలో అందరూ 'నవ్వుల రేడు' అంటారు. కారణం — ఆయన ముఖంలో ఎప్పుడూ నవ్వు తాండవం ఆడుతుంది.

పి. ఏ. పి. నిర్మించారు 'పల్లెటూరి బావ' చిత్రాన్ని. గతవారం చూపించారు ఆ చిత్రాన్ని.

'పల్లెటూరి బావ'లో పిలక బావగా నాగేశ్వరరావు నిండుగా, నాజూకుగా, నాణ్యంగా నటించారు. నాగరికత పేరిట జరిగే అన్యాయాన్ని, అరికట్టే నాయకుని పాత్ర ఆయనది. నీతికి, నిజాయితీకి కట్టుబడి జీవితాన్ని సాగించడమే మన సంస్కృతి అనేది నిజాన్ని తెలిపే వుత్తమ నాయకుడు అక్కినేని, యీ చిత్రంలో.

అక్కినేనిని 'పిలక బావా, పిలక బావా' అంటూ పిలిచే ఆధునిక యువతిగా లక్ష్మి నటించింది. వీరిద్దరి మధ్య సాగే సంభాషణలు కడుపుబ్బ నవ్విస్తాయి. అంత బాగా పనిచేసింది భమిడిపాటి కలం.

పల్లెటూరి జీవితానికి, పట్నవాసపు జీవితానికిగల తారతమ్యాన్ని, ఫేషన్ల పేరిట జీవితాలను నరకం చేసుకుంటున్న వ్యక్తుల గుణగణాలను సహజంగా చిత్రీకరించారు. ప్రత్యగాత్మ.

స్త్రీకి ఎన్నివున్నా భర్త నీడ కరువైతే ఆమె ఎన్ని అవమానాలకు తలవొగ్గవలసి వస్తుందో, యీకథ చెపుతుంది. అలాగే పుట్టినబిడ్డ తొలిసారిగా తల్లిపాలు త్రాగకపోతే, ఆవిడ ఎంత క్షోభపడుతుందో యీ కథ చెపుతుంది.

'పల్లెటూరి బావ' చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయను, కృష్ణస్వామి కూర్పును, శాస్త్రి ప్రొడక్షన్ను నిర్వహించారు. ఈ చిత్రంలో నాగభూషణం, రాజబాబు, రేలంగి, రమణారెడ్డి, చంద్రమోహన్, సారధి, మాడా, సుకుమారి, నిర్మల, అనూరాధ, శుభ, రమాప్రభ ముఖ్యపాత్రధారులు. నవయుగ విడుదల.

# సినిమా

## సారథిలో రీ-రికార్డింగ్

'పల్లెటూరి బావ' చిత్రం యొక్క రీ...రికార్డింగ్ హైదరాబాద్ సారధి స్టుడియోలో జరిగింది. ఇటీవల యీ స్టుడియోలో రీ—రికార్డింగ్ జరుపుకొన్న చిత్రం యిదేనేమో. ఈ చిత్రంలో చలపతిరావు నాలుగుపాటలను హిట్ చేయిస్తారు.

## కొత్తవాళ్లు...ప్రేక్షకులు

మన సినిమావాళ్లు కొత్తముఖాలతో ప్రయోగాలు చేస్తున్నారు. కానీ మన ప్రేక్షకులు ఆ ముఖాలను తెరపై చూడటమే ఆలస్యం ... గలాటా చేస్తున్నారు. అనరాని మాటలతో ఆడిపోసుకొంటున్నారు. వాళ్లు తిట్టడానికి కారణం లేకపోలేదు. మనవాళ్లు పరిచయంచేస్తున్న వాళ్లు పనికివచ్చే రకాలుగా వుండటం లేదు.

## తుకారాం హీరో ఎవరు?

హాస్యనటుడు రమణారెడ్డి యింట పెండ్లి జరిగినప్పుడు, ఆదినారాయణరావుకు 'తుకారాం' నిర్మించమని సలహా నొసగారు,



'మమత'లో జమున, బేబీ శ్రీదేవి.



ఆర్. సి ప్రొడక్షన్స్ చిత్రంలో విజయలలిత.

హీరో నాగేశ్వరరావు.

ఆయన సలహాను సారంగా 'భక్త తుకారాం' వర్ణచిత్రం అపూర్వంగా తయారైంది. ఈ చిత్రంలో హీరో ఎవరు? అన్న ప్రశ్న నాలాగా మీకూ వుదయిస్తుంది, సినిమా చూసేప్పుడు.

'తుకారాం' పాత్రను 'నభూతో నభవిష్యతి'గా పోషించిన నాగేశ్వరరావును హీరో అనడమా? బండరాళ్లను కరిగించే కమ్మటి సంగీతాన్ని సమకూర్చిన ఆదినారాయణరావును హీరో అనడమా? ముత్యాల్లాంటి మాటలను పొదిగిన వీటూరిని అనడమా? లేక యీ చిత్రాన్ని ఎంతో అందంగా, చూచేవాడిడెందానికి ఆనందాన్ని కలిగించే, విధంగా దర్శకత్వం నెరపిన మధుసూదనరావును హీరో అనడమా? కనిపించేది కాస్సేపు అయినా, తన రాచఠీవితో,—నటనా ప్రతిభతో ఛత్రపతిగా సాక్షాత్కరించిన శివాజీని హీరో అనడమా? నాకు అర్థంగాకుండా వుంది హీరో ఎవరని తేల్చడానికి.

## పెద్దమార్పు...

ఇటీవల వచ్చేవన్నీ సాంఘికాలే. ఇలాంటి భక్తి, ముక్తి ముఖ్యాంశంగాగొన్న చిత్రం వచ్చి చాలా ఏండ్లు అయింది. పైగా, నాగేశ్వరరావు యిలాంటి వేషం ధరించి


Thomas/dcm/5/72 TEL

కూడా అనేక సంవత్సరాలు అయింది. మధుసూదనరావుకుకూడా యిదొక వెరైటీ. ఇన్నివున్న చిత్రం గాబట్టి, 'భక్తతుకారాం' ప్రజలు అభిమానంపొందే అవకాశం వుంది. ఈ చిత్రం లక్ష్మిద్వారా విడుదలవుతుంది.

## జగమే మాయ

నవోదయ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన చిత్రం యిది. ఈ సంస్థను 'రైతు కుటుంబం' పి. వి. సుబ్బారావు స్థాపించారు. కూర్గు కొండల్లో షూటింగు జరిపారు. ఇన్‌డోర్ కూడా అక్కడే ఎస్టేట్ హవున్‌లో చేసి వచ్చారు.

ఏప్రిల్ 27న విడుదల కావలసిన చిత్రం యిది. కానీ, లక్ష్మి చార్టులో సరైన థియేటర్లు అప్పట్లో దొరక్క, చిత్రం విడుదల కాలేదు.

'జగమేమాయ' పేరు ఎలా సరిపోయింది మీ చిత్రానికి?' అని పూర్ణచంద్రరావును ప్రశ్నించాను.

'మా కథావస్తువుకు సరిపడే టైటిలు యిది. ఈ జగత్తులో ఎవరు మంచివాళ్ళు, ఎవరుకాదు అని తేల్చడం అసాధ్యం. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్లు అనుకోడం ప్రమాదం. మంచిగా వుంటూ వంచనచేసేవాళ్లు ఎందరోవున్నారు యీ ప్రపంచంలో. అలాంటి వ్యక్తులకు సంబంధించిన కథ ఆవడంచేత 'జగమేమాయ' అని పేరు పెట్టాము' అన్నారు పూర్ణచంద్రరావు.

ఇదొక 'బీన్‌సాల్‌బాద్'లాంటి కథ. రచన గొల్లపూడిది. సంగీతాన్ని సత్యం, ఛాయమణి, దర్శకత్వాన్ని అయ్యన్‌మూర్తి నిర్వహించారు.

## తాతినేని చిత్రంలో కృష్ణ

ఈ చిత్రంలో విజయలలిత, రాజబాబులతోబాటు గిరిబాబు, మురళీమోహన్, సునందిని, విజయ ముఖ్యపాత్రలను పోషించారు.

తెలుగుగడ్డ గర్వించదగ్గ దర్శకుల్లో తాతినేని ప్రకాశరావు ఒకరు. వీరు తెలుగునాటమాత్రమేగాక, హిందీదేశంలో కూడా టాప్ డైరెక్టరుగా ప్రజలచేత ఆమోదింపబడ్డారు.

సారథి స్టుడియో పార్టనర్‌షిప్‌తో

# సినిమా

'మైనర్‌బాబు' చిత్రాన్ని ప్రకాశరావు నిర్మించారు. ఆయనే దర్శకుడు.

ఇప్పుడాయన స్వంతంగా ఒక చిత్రాన్ని ఆరంభించబోతున్నారు. ఈ చిత్రంలో కృష్ణ కథానాయకుడు, భమిడిపాటి రచన చేస్తున్నారు.

## డాక్టర్ నిర్మించే డాక్టర్ కథ

మదరాసు సినిమావాళ్లకు డాక్టర్. రామదాసు అంటే తెలియనివారు వుండరు. వీరు ప్రముఖంగావుండిన రంగనాథదాసుగారి సోదరులు. వీరిదగ్గర ఒక డాక్టర్ జీవిత కథ వుంది. ఆ కథను చిత్రంగా తీయబోతున్నారు. కథానాయికపాత్రను ఎస్వీ రామారావు పోషిస్తారు. ఈ చిత్రానికి తాతినేని ప్రకాశరావు దర్శకుడు.

## విజయనిర్మల రాణిస్తుంది

నటి విజయనిర్మల దర్శకత్వం చేపట్టింది ఒక మంచి నవలకు. ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి



'గుండెలుతీసిన మొనగాడు'లో కాంతారావు, జ్యోతిలక్ష్మి.




అక్కినేని నాగేశ్వరరావు.
(చిత్రకారుడు: శ్రీ కొండూరు నాగేశ్వరరావు.)

విరచితమైన 'మీనా'కి యీమెయే దర్శకురాలు, నాయకురాలు.

ఈవిడ దర్శకురాలిగా రాణించడం తథ్యం. నేను యిలా ఘంటాపథంగా చెప్పడానికి కారణం—ఆమె దర్శకత్వం నెరపిన 'కవిత'—మళయాళ చిత్రం చూడడమే.

'కవిత'కు ఆమె దర్శకత్వం ఘనతను చేకూర్చింది. మళయాళరంగం ఆమెను టెక్నిషియన్‌గా అంగీకరించింది. ఆమె సరేనంటే చాలు, నల్గురయిదుగురు రెడీగా వున్నారు, మళయాళ నిర్మాతలు, దర్శకత్వం యివ్వడానికి.

*నటిగామాత్రం ఏం తక్కువ?*

'తాత—మనవడు' చిత్రంలో సూకాలమ్మను ఒక పట్టుపట్టింది. ప్రేక్షకులు ఆమెను ఆ పాత్రలో ఎంతగా మెచ్చుకొన్నారో? ఇకపై నటిగా, దర్శకురాలిగా విజయనిర్మల విజృంభించబోతోంది.

శ్రీనివాస్ ●

15—6—73



గౌరీ శంకర్ పిక్చర్స్

# తల్లీ కొడుకులు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: పి. చంద్రశేఖర రెడ్డి బి.ఎ.

నిర్మాతలు: గుమ్మడి వీరయ్య, రామినేని కోటేశ్వరరావు

ఆంధ్రా: తారకరామా
నైజాం: నవభారత్
సీడెడ్: శ్రీ తారకరామ

TARAKARAMA




**జరిగిన కథ**

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుంటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసార బాధ్యత అంతా నిలయదే. ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న భాస్కర్రావు ఆమెని పెళ్ళాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించలేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆసికి తగినవాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని మద్రాసు తీసుకు వచ్చాడు మోహన్.

# 3

లోకని తీసుకుని చౌదరి దగ్గిరికి బయల్దేరాడు మోహన్. దారిలో అంది లోక. 'ఏవిటి మోహన్ ఆ చౌదరి అదోలా చూస్తాడు. అదోలా మాట్లాడతాడు. భరించలేకుండా ఉన్నాయి చూపులు. నాకెందుకో ఆయనంటే భయంగా ఉంది.'

'భయమెందుకూ? అయినా నువ్వేటి కుర్చిపోకూడదు లోకా! మనకోరిక తీరి మన ఆశయం నెరవేరాలంటే మనకిష్టం లేని పనులు కొన్ని చెయ్యాల్సి ఉంటుంది. తప్పదు. ఎవరితో మాట్లాడకుండా మూల కూర్చుంటే మనపని జరిగేదెలా?'

'అదీ నిజమేలే!' ఒప్పుకుంది లోక

ఇద్దరూ వెళ్ళేటప్పటికి మరో యువకుడితో మాట్లాడుతూ కూర్చున్నాడు చౌదరి. ఆ నూతన వ్యక్తిని గుర్తించింది లోక, అతనిపేరు రాజా. ఈమధ్య ఎక్కువ సినిమాల్లో హీరోగా అతనే వేస్తున్నాడు.

లోకవైపు చూసి అన్నాడు చౌదరి 'ఇతనే మన హీరో.'

'మీ పేరు చాలా తమాషాగా ఉందే. చౌదరిగారు చెప్పారు' అన్నాడు రాజా.

'నేనూ అదే అనుకుంటున్నాను. పేరు మార్చాల్సి ఉంటుందని.'

చౌదరి మాటలకి తల అడ్డంగా ఊగించాడు రాజా 'నో. నో. పేరు మార్చాల్సిన అవసరం ఏవుంది? ఈ పేరే బావుంది. కొత్తరకంగా ఉంది. కొత్త హీరోయిన్. కొత్త పేరు.' మొగమాటంగానూ, సిగ్గుగానూ తల వంచుకుంది లోక.

లోక గుండెల్లో గుబులు బయల్దేరింది. తను నటించిన సినిమా జయప్రదంగా గడిస్తే మంచి పేరొస్తుంది తనకి. మిగతావాళ్ళు కూడా బుక్ చేసుకుంటారు. లేకపోతే మళ్లి ఎవరూ తన మొహం చూడరు. ఈ మొట్టమొదటి దానిమీదే తన అదృష్ట—దురదృష్టాలు ఆధారపడి ఉన్నాయి. రాజాకైతే అనుభవం ఉంది. ఈమధ్య అతను నటించిన సినిమాలు విజయవంతం అవుతాయన్న నమ్మకం బయల్దేరింది నిర్మాతల్లో. అందుకే ఈ చౌదరికూడా అతన్ని హీరోగా తీసుకుంటాడు.

'ఇంతకీ షూటింగు మొదలు పెట్టడం.' చౌదరి మాటలు పూర్తికాకుండానే అందుకున్నాడు రాజా 'బహుశా వారం పది రోజులదాకా ఖాళీ ఉండదు. మళ్ళీ ఫోను చేసి చెప్తాను. కాల్షీట్స్ బుక్ అయిపోయాయి...ఆ...నాకాట్టే టైము లేదు, ఏప్రిల్లో షూటింగు ఉండొచ్చు. వెళ్తాలి' వాచీ చూసుకున్నాడు రాజా. అతని పర్సనాలిటీని మరోసారి కరువుతీరా చూసింది లోక. రెండడుగులు వేసి మళ్ళీ వెనక్కి వచ్చాడు రాజా. 'ఆ! చూడు మోహన్. శనివారం రాత్రి నాతో డిన్నరు తీసుకోవాలి మీరిద్దరూ. చౌదరిదగ్గిర నా అడ్రసు తీసుకో. ఓ. కె. ఎనిమిదిన్నరకి' అంటూ గబగబా వెళ్ళిపోయాడు.

చౌదరి కళ్ళల్లో అసూయ తొంగి చూసింది. రాజా వెళ్ళగానే 'రేపురాత్రి నాకు కంపెనీ ఇవ్వాలి నువ్వు. అదే ... నాతో కల్సి ... అదే మా ఇంటికి డిన్నర్కి రావాలి' అంటూ తడబడుతూ, తాగేస్తున్నట్టుగా లోకవైపు చూశాడు.

'ఓ. కే.' అన్నాడు మోహన్.

రాత్రి సరిగ్గా ఎనిమిదిన్నరకల్లా మోహన్తోసహా రాజా ఇంట్లో అడుగు పెట్టింది లోక. ఇల్లు చాలా అందంగా, అధునాతనంగా ఉంది. ఇంట్లో నౌకర్లు, వంటవాడు తప్ప మరెవరూ ఉన్నట్టు కనిపించలేదు. వెళ్ళగానే ముందు మూడు కూల్డ్రింక్స్ కలిపి తీసుకొచ్చాడు వంటవాడు. తాగడం పూర్తయాక ఎదురుగా ఉన్న పేపరు చేతిలోకి తీసుకుని కూర్చున్నాడు మోహన్. 'కమాన్! మేడమీద గదులు చూద్దువుగానిరా!' అంటూ లోకని పిల్చి జవాబుకోసం ఎదురుచూడకుండా మెట్లవైపు నడిచాడు రాజా. మోహన్ వైపు తిరిగింది లోక. అతను పేపరు మించి దృష్టి మరల్చలేదు. మాట్లాడకుండా రాజా వెనకే నడిచింది. మేడమీద నాలుగు గదులున్నాయి. ఎటాచ్డ్ బాత్ లావెట్రీ ఉన్నాయి. ఏవేవో మాట్లాడుతూ గదులన్నీ చూపించాడు రాజా. అన్నీ కూడా చాలా అందంగా అలంకరించబడున్నాయి. పడగ్గదిలో తన మంచంమీద దిండుకానుకుని వాలాడు రాజా. గోడలకున్న అందమైన అమ్మాయిల పెయింటింగులు చూస్తూ నిలబడింది లోక. ఆలోచనలు మనసులో సుళ్ళు తిరుగుతున్నాయి. పెద్ద పేరున్న నటుడు, తనబోటివాళ్ని ఇంటికి భోజనానికి ఆహ్వానించడం ఏవిటి? ఇది ఎవళ్ళకి నామూలేనేమో? తనకైతే కొత్తగా ఉందిగానీ! సినిమా రంగానికి తను కొత్తకదా అని, కాస్త ధైర్యం అలవడు



తుందని స్నేహంగా ఆహ్వానించాడేమో! దానికే తను అపార్థం చేసుకుంటే ఎలా? 'కూర్చో!' అదోరకంగా ధ్వనించింది రాజా గొంతు. కుర్చీవైపు నడిచింది లోక. పగలబడి నవ్వాడు రాజా.

బిత్తరపోయి చూసింది. 'అంతలా ముడి కట్టుక్కూర్చుంటే సినిమాల్లో పైకి రావడం చాలా కష్టం' అంటూ మంచం మీద తన పక్కన జాగా చూపించాడు.

'మన కోరికతీరి మన ఆశయం నెరవేరాలంటే మన కిష్టంలేని పన్లు కొన్ని చెయ్యాల్సి ఉంటుంది.' మోహన్‌మాటలు చెవుల్లో ప్రతిధ్వనించి తల్లడిల్లిపోయింది లోక మనసు. భయంభయంగా ఒదిగి కూర్చుంది మంచంమీద. రాజా చేతులు లోకని దగ్గిరకి తీసుకున్నాయి. ఒళ్ళు గగుర్పొడిచింది లోకకి. 'కింద... మోహన్ ఒక్కడే...' అంటూ, వణుకుతున్న కంఠంతో మాట పూర్తి చెయ్యలేకపోయింది.

'ఓ! ఔను, ఒక్కడే ఉన్నాడు కదూ పాపం! వెళ్దాం కిందకి. మందు భోంచేద్దాం. తర్వాత ... ఏమంటావు?'

అప్పటికాగండం గడిస్తే చాలన్నట్టుగా తల ఊపింది లోక. ఉషారుగా ఈలవేస్తూ

# విడిన మబ్బులు

ఎంపెం దిగాడు రాజా.

'సారీ! మోహన్! మేమిద్దరం కల్సి నిన్నొంటరిగా వొదిలేసి ఉన్నాం' రాజా మాటలకి తేలిగ్గా నవ్వేశాడు మోహన్. భోంచేస్తున్నంతసేపూ కూడా, మోహన్ ఉన్న సంగతే గుర్తులేనట్టు లోకతోనే కబుర్లేసుకున్నాడు రాజా.

అది కొంచెం బాధే అనిపించింది లోకకి. సినిమాల్లో నటించడానికి ఎంత చొరవ, కలుపుగోలుతనం ఉండాలో నలుగురిలోనూ కల్సిపోయి ఉండడం ఎలా అలవరచుకోవాలో వివరిస్తూ, మధ్య మధ్య నవ్విస్తూ, కబుర్లు చెప్తూనే ఉన్నాడు రాజా. అతనంత చనువుగా తన భయం పోగొడుతూ కబుర్లు చెప్తుంటే తనేమీ మాట్లాడకపోవడం బావుండదని అనుకోదా మధ్యమధ్యలో మాట్లాడటం మొదలు పెట్టింది లోక. ఉన్నట్టుండి అడిగాడు రాజా 'ఏం మోహన్! నువ్వేం మాట్లాడవేం?'

'తనక్కడున్న సంగతే మర్చిపోయి, పైగా ఎలా అడుగుతున్నాడో చూడు!' మనసులోనే కోపాన్ని అణచిపెట్టి అన్నాడు 'అందరూ మాట్లాడితే వినేవాళ్ళెవరు? మీరిద్దరూ మాట్లాడుతుంటే నేను వింటున్నాను.'

నవ్వాడు రాజా. 'చూడు మోహన్! ఈ చౌదరికి నేనెంత చెప్తే అంత. ఒక్క చౌదరే కాదులే. ఈమధ్య ప్రొడ్యూసర్లందరికీ కూడా నామీద మంచి గురి కుదిరింది. నేను వేసిన సినిమా తప్పకుండా శతదినోత్సవం చేసుకుంటుందన్న నమ్మకం కుదిరింది. నేను ఫలానా హీరోయిన్‌తోనే వేస్తాను అంటే తక్షణం ఆ అమ్మాయినే బుక్ చేస్తారు హీరోయిన్‌గా. ఈమధ్య నేనే చౌదరికి సలహా ఇచ్చాను కొత్త మొహాల కోసం వేటాడమని. లక్కీగా నువ్వు చౌదర్ని కల్సుకున్నావు. చౌదరి, నేనూ చిన్నప్పట్నించీ స్నేహితులం.' భోజనం పూర్తయ్యాక ఐస్‌క్రీమ్ అందించాడు వంటవాడు. అది కూడా కానిచ్చి డ్రాయింగు రూమ్‌లో కొచ్చి కూర్చున్నారు ముగ్గురూ. కాసేపు అవీ, ఇవీ మాట్లాడాక 'మోహన్! నీకేదో పనుందన్నావుగా. నువ్వెళ్ళు లోకని రేపొద్దున్న తీసికెళ్తు' రాజా కళ్ళల్లో నవ్వు లోకని భయపెట్టింది. అరక్షణంలో అతని మనసు గ్రహించింది. కాళ్ళల్లో వణుకు మొదలైంది. కళ్ళల్లో నీళ్ళొస్తుంటే తక్కువగా అంది 'నేను కూడా నీతో వచ్చేస్తాను మోహన్!'

నవ్వుతూ మోహన్ దగ్గరగా జరిగి చెవిలో అన్నాడు రాజా 'కొత్త కదూ! భయపడుతున్నట్టుంది. ఇవాల్టికి పోనీ!'

బ్రతికానురా భగవంతుడా అనుకుంటూ రాజాకి బైబై చెప్పి మోహన్‌తో బయటికి నడిచింది లోక.

గదికి చేరగానే చిరాకు చూపిస్తూ అన్నాడు మోహన్ 'నేనేం చెప్పాను నీకు? నువ్వది మర్చిపోతే ఎలా? మనకిష్టం ఉన్నా లేకపోయినా తప్పదు మరి? లేకపోతే పేరెలా వొస్తుంది? ఛాన్స్ ఎలా వొస్తుంది? రాజా చెప్పింది విన్నావుగా. అతనే అమ్మాయి హీరోయిన్‌గా కావాలంటే ఆ అమ్మాయినే తీసుకొంటారు ప్రొడ్యూసర్లు. అలాంటప్పుడు అతనిమాట మనం కాదంటే రేపొద్దున్న 'లోకతో నేను నటించ'నంటే మనపని ఆఖరు. ఈమధ్య ప్రతి సినిమాలోనూ రాజా, లీలావతీ హీరో హీరోయిన్లు. అటువంటిదిప్పు డెందుకో గాని వాళ్ళిద్దరికీ పడట్లేదు. ఏవో గొడవలొచ్చాయి. అందుకని కొత్త మొహాలకోసం వేటాడమని చౌదరితో చెప్పాడు రాజా. ఆ లీలావతికి ఈర్ష్య పుట్టాలని నీతోటే దాన్ని చేరదియ్యాలని చూస్తున్నాడు రాజా. నువ్వేమో...'

'మోహన్...నాకిదంతా ఇష్టంలేదు. ఏదో సినిమాల్లో వెయ్యాలన్న సంబరంతో నువ్వన్నదానికి సరేనన్నాను కాని నేనిదంతా ఆలోచించలేదు. నావల్ల కాదు. నాకెంత అహంకారం ఉన్నా, నాకెన్ని కోరికలున్నా ఇంత నీచానికి మాత్రం నేనెన్నడూ దిగేరకాన్ని కాను. నేనెంత మొండిదాన్నో నీకు బాగా తెల్సు. మనస్ఫూర్తిగా నిన్ను ప్రేమించాను. నిన్నే నమ్ముకుని వచ్చేశాను. సినిమాలో వేషం కోసమని అడ్డమైన వెధవలూ కోరినట్టల్లా నేను చెయ్యలేను. నాకూ ఓ మనసుంది...నాకూ వ్యక్తిత్వముంది.'

'చాలు...చాలు...కబుర్లేం చెప్పక్కర్లేదు. అక్కడికేదో మహాపతివ్రతవైనట్టు, కన్నతండ్రినీ, అక్కనీ వొదిలి నాతో లేచి వొచ్చినదానికి...'

'ఎందుకు మోహన్ చిత్రవధ చేస్తావు మాటల్తో...'

'రేపు చౌదరి డిన్నర్‌కి రమ్మన్నాడు... అతనేదన్నా కోరిక...'

వినలేక చెవులు మూసుకుంది లోక. 'చౌదరీ లేడు.. డిన్నరూ లేదు. నేను వచ్చినా రాను. సినిమాల్లో నటించడమూ వొద్దు... పేరూ వొద్దు. హాయిగా నువ్వేదన్నా ఉద్యోగం చూసుకో మోహన్... అయినా మీ అమ్మా, నాన్నగారూ ఉన్నారన్నావుగా...వాళ్ళదగ్గిరికి వెళ్ళిపోదాం పద ...ఏ ఊళ్ళో ఉన్నారు?'



'[illegible]! [illegible] గుమ్మం తొక్కనిస్తాడా మా నాన్న? మెడ పట్టుకు బయటికి గెంటుతాడు.'

'మరి మనకి గడిచేదెలా?'

'నువ్వే ఆలోచించుకో.'

'ఇంక ఆలోచించడం ఏంలేదు. సినిమాల్లో వెయ్యాలన్న కోరిక చచ్చిపోయింది. నేను నీతోనే ఉంటాను. నువ్వే కావాలి నాకు, పైగా...మోహన్...' తల దించుకుంది లోక.

'ఊఁ ఏవిటి?' విసుగ్గా చూశాడు మోహన్.

'మనం అమ్మా, నాన్నా కాబోతున్నాం.'

నెత్తిన పిడుగుపడి నట్టయింది మోహన్‌కి.

జేవురించిన మోహంతో, మరింత ఎర్రబడ్డ కళ్ళతో కర్కశంగా చూశాడు లోక వైపు.

ఆకులా వణికి పోయింది లోక ఆ చూపుకి.

'నావు కబురు చల్లగా చెప్తున్నావా? హు...' మరి మాట్లాడక మూతి బిగించి పడుకున్నాడు. చిన్నగా నిట్టూర్చింది లోక. తెల్లారి లేచేటప్పటికి లేడు మోహన్. గదిలో నాలుగు పక్కలా చూసిన లోక విస్తుపోయింది. గోడ దగ్గర ఉండాల్సిన మోహన్ చేతిసంచీ లేదు. అనుమానంతో, భయంతో దగ్గరగా వేసి ఉన్న తలుపు తీసి బయటికి చూసింది. మోహన్ జాడలేదు. రెండు చేతుల్లో మోహం దాచుకుని తలుపు దగ్గరే కూలబడి పోయింది.

'ఎంతపని చేశావు మోహన్! ఒంటరిగా వొదిలి మోసం చేసి వెళ్ళి పోయావా? ఇప్పుడు నాగతేం కావాలి? నిన్నే నమ్ముకుని వొచ్చానే! నీకే నా మనసర్పించానే! ఎందుకిలా చేశావు. నేనేం తప్పు చేశాను? నా బ్రతుకేం కావాలి? నాకెవరు దిక్కు?' దుఃఖంతో తల్లడిల్లి పోయే లోకకి సమాధానం చెప్పేవారు లేక పోయారు.

* * *

ఆఫీసు నించి ఇంటికి వొస్తూ పౌడరు డబ్బా కొన్నాడు భాస్కర్రావు. చెప్పులు విప్పి కుర్చీలో కూర్చుంటూ భార్య చేతికి పౌడరు డబ్బా అందించాడు.

'ఆ! ఎందుకూ పౌడర్లూ, [illegible]

పండగ ఖర్చులు. ఊరికే పోస్తాయా? డబ్బులు పొయ్యండే. అవేమన్నా కడుపు నింపుతాయా? కాలు నింపుతాయా?' సన్నగా గొణుగుతూ వంటింట్లోకి వెళ్ళింది సుభద్రమ్మ. చిత్తరువే అయ్యాడు భాస్కర్రావు అంతకన్నా చెప్పచ్చుకు మోహా మ్మీన కొడితే సంతోషించేవాడు. ఎప్పుడూ తను పౌడరు రాసుకోడు. ఇంతవరకెప్పుడూ ఒక పౌడరుగానీ, స్నో గానీ కొనలేదు. తమ్ముళ్ళు ప్రతినెలా అతి ఖరీదైన పౌడర్లూ స్నోలూ కొనుక్కుని వాడుతుంటారు. ఒకళ్ళు వాడే రకం ఇంకోళ్ళకి పనికి రాదు. ముగ్గురూ కూడా వాళ్ళకి కావల్సిన స్నోలూ, పౌడర్లూ వేరు వేరుగా కొనుక్కుంటారు. ఒక్కసారైనా ఎప్పుడైనా వాళ్ళని ఎందుకలా అన్నేసి పౌడర్లూ, స్నోలూ కొంటారని అందా? లేదే! అంత ఇదిగా ఫ్యాషన్లకి, గొప్పలకి డబ్బు తగలేసే వాళ్ళని పన్నెత్తి ఒక్కసారన్నా మందలించ లేదే! మాటవరసకైనా ఇదేమిటని అడగలేదెన్నడూ! మరి అటువంటిది, తను పుట్టిన ఇన్నేళ్ళకి ఇప్పుడు అదయినా ఏదో భార్య ముచ్చటపడింది కదా అని కొట్లో ఉన్న అన్నిట్లోకి అతి చౌకయిన పౌడరు డబ్బా ఒకటి కొన్నందుకు ఎటువంటి మాట వినాల్సి వచ్చింది. ఏం నగలడిగిందా నాణ్యాలడిగిందా వరలక్ష్మి?' భాస్కర్రావు మనసు గాయపడింది. లేచి తన గదిలోకి వెళ్ళాడు, చేతిలో డబ్బాతో, కిటికీ దగ్గిర నిలబడుంది వరలక్ష్మి. వెనకగా వెళ్ళి భుజం మీద చెయ్యి వేశాడు. వరలక్ష్మి కళ్ళల్లో నిండిన నీళ్ళు చెంపల్ని తడిపాయి.

'ఊరుకో వరం!'

'తిరగిరా తిప్పి అవతల గిరాటు వెయ్యండి. నాకొద్దు.'

'ఛ ఎందుకలా అంటావు? నాకోసం...'

'నాకక్కర్లేదు. నేను పౌడరు రాసుకుంటే ఒట్టు.' అణువణువునా అభిమానం నిండి ఉన్న వరలక్ష్మి డబ్బా కిటికీలో పడేసి గిరుక్కున వెనక్కి తిరిగి అక్కడి నించి వెళ్ళిపోయింది. 'ఛీ! ఛీ! వెధవ కొంప.' భాస్కర్రావు మనసులో చిన్న జరిగిన సంఘటన మెదిలింది. చిన్నేళ్ళనించో వాడుతున్నాడు తన పెన్ను. చౌక రకం పెన్నది. ఇప్పటికి రెండుసార్లన్నా పాళీ మార్చించి ఉంటాడు, అదిప్పుడింకా బొత్తిగా పాడైంది. మూత తీస్తే చాలు సిరా అవుతోంది చేతికి. అందుకని ఇంకో పెన్ను కొనుక్కోవాలని నాన్నగారి దగ్గిర మాట కదిపాడంతే. ఆయన అరగంట లెక్చరిచ్చారు. 'ఎందుకురా అది మూలపడేసి ఇంకోటి కొనడం వచ్చినన్నాళ్ళూ వాడు దాన్ని. గరుకుగానో ఎలాగో రాస్తోంది కదా అసలు. ఇప్పుడప్పుడే ఇంకోటి కొనకు. సాధ్యమైనంతమటుకు జేబులోంచి పైసా తియ్యకుండా ఉండడానికే ప్రయత్నించు.' అంటూ. ఇవాళ పొద్దున్న వాసు కొత్త పెన్ను కొనుక్కుని ఇంట్లో అందరికీ చూపించాడు. వాడి పాత పెన్ను తన పెన్ను కంటే వెయ్యిరెట్లు మెరుగు. అయినా వాడది బాగు లేదని కొత్తది కొనుక్కున్నాడు. పాతది ఎవరో స్నేహితుడికి దానం చేశాట్ట. నాన్నగారు కొత్త పెన్నుచూసి 'బావుందినా' అని ఊరుకున్నారు తప్ప మరోమాట అనలేదు. తనే వెర్రివెధవ అందర్లోకీ. ఏపనిచేసినా, ఏం కొనాలన్నా అమ్మతో-నాన్నతో చెప్పిగానీ చెయ్యడు. వాళ్ళేమో తన కోరికలమీద, తన అవసరాలమీదా నీళ్ళు చల్లుతుంటారు. 'ఎందుకురా ఇప్పుడవన్నీ! ఇప్పుడవి కొనకపోతేనేం!' అనో 'ఇప్పుడది కొని డబ్బు తగలెయ్యకపోతేనేం' అనో అంటారు. తనని దద్దమ్మనిచేసి కూర్చోపెడతారు. అవే తమ్ముళ్ళయితే వాళ్ళేం కొనుక్కున్నా కొన్నాకగానీ ఆ సంగతి ఇంట్లో తెలియజెయ్యరు. అమ్మా, నాన్నా వాళ్ళేంకొన్నా, వాళ్ళెలా ఖర్చుపెట్టినా కిక్కురుమనరు. పైగా 'చిన్నవెధవ సరదాపడి కొనుక్కున్నాడు' అంటూ ముచ్చటగా చెప్పుకుంటారు. ఆలోచన్లాపి, చిరాకుగా చెప్పుల్లో కాళ్ళుదూర్చి బయటికి నడిచాడు భాస్కర్రావు. తనమీద తనకే జాలివేసింది. ఇన్నేళ్ళొచ్చి, ఉద్యోగం కూడా చేసుకుంటున్న తను ఇటువంటి పరిస్థితిలో ఉన్నాడంటే బయటివాళ్ళెవరూ నమ్మరు. పైగా నవ్వుతారు కూడా. కానీ ఇది ముమ్మాటికి నిజం.

'కాఫీ' వెనక్కితిరిగి వరలక్ష్మి అందించిన కాఫీగ్లాసు తీసుకుని గంగబా తాగేసి గ్లాసక్కడ ఉంచి, ఎక్కడికో తనకే తెలియకుండా ఏక గమ్యం అంటూ లేకుండా రోడ్డుమీద నడకసాగించాడు.

* * *

'ఏమిటివాళ పరధ్యానంగా ఉన్నారు?'

'ఊ' ఉలికిపాటుతో చటుక్కున తలెత్తింది నిలయ.

ఎదురుగా భాస్కర్రావు. 'అబ్బే! ఏమీ లేదు' అంది మెల్లిగా.

'మీరు కాదన్నా మీరు టైపుచేసిన ఈ లెటరే చెప్తోంది మీ పరధ్యానం.'

అది చూసిన నిలయకి నవ్వొచ్చింది. దాన్నిండా కావల్సినన్ని తప్పులు. ఎప్పుడూ ఒక్క తప్పుకూడా పోని తనకివాళ ... తన మీద తనకేకోపం వచ్చింది.

'ఇప్పుడే నిమిషంలో మళ్ళీ సరిగ్గా టైపు చేస్తాను.'

'మీరు లేవండి. నేను చేస్తాను.'

'అదేమిటి?' తెల్లబోయింది నిలయ.

'ఫర్వాలేదు లేవండి. మీ మనసేం బావున్నట్టులేదివాళ. మీ నాన్నగారి ఒంట్లో ఎలా ఉంది?' అంటూనే టైపు రైటర్‌లో కార్బన్, తెల్లకాగితం సరిగ్గా అమర్చుకోడంలో పడ్డాడు భాస్కర్రావు. తప్పనిసరిగా లేచింది నిలయ. అతని మంచితనానికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది.

'నాన్నగారి ఒంట్లో నిన్నటినించీ బాగా లేదుగా ఉంది. నాకెందుకో భయంగా ఉంది.'

'మరి మీరు నాల్రోజులు సెలవుపెట్టకూడదూ!'

'అదే ఆలోచిస్తున్నాను.'

'ఇంకా ఆలోచన దేనికండీ. ముందు ఆయన ఆరోగ్యం ముఖ్యం కదా! మీకేవన్నా సహాయం నేను చెయ్యగలిగితే చెప్పండి. బజార్నించి ఏవన్నా తెచ్చిపెట్టాలంటే...'

'అబ్బే! ఫరవాలేదు లెండి. అంతవసరం లేదు. థ్యాంక్స్' హెడ్ గుమాస్తా రామనాధంగారి కళ్ళు తమమీదే ఉండడం గమనించింది నిలయ. ఆయన వాడి చూపులు సూటిగా గుచ్చుకున్నాయి. ఆయన పాము చెవులు ప్రతిమాటా వినడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆయన అదేపనిగా తమని చూడటం చూసిన నిలయకి ఒళ్ళు మండింది. అయినా చేసేదిలేక మనసులోనే బాధపడుతూ మౌనంగా ఉండిపోయింది.

## ఒక్క పైస ఖర్చుతో 1 చీరగాని లేక 3 చొక్కాలుగాని మంచుకన్న తెల్లగా చెయ్యటం కోసం

# మాక్సిమ్*

అన్ని బట్టల కోసం బాగా పనిచేసే వైట్‌నర్

**ఇది ఎంత పొదుపో!**

ఏ బట్టనైనా సరే కొత్తదానిలాగ తెల్లగా చెయ్యాలంటే సగటు ఒక్క చుక్క మాక్సిమ్ చాలు. ఇది మీకు తెలుసా? ఒక మాక్సిమ్ సీసాలో సుమారు 1200 చుక్కలుంటాయి! అంటే మాక్సిమ్ అన్నిటికన్న పొదుపైన ఘనీభూతమైన నీలపు ద్రవం యీ వైట్‌నర్. ఈ ప్లాస్టిక్ సీసాకి ప్రత్యేకంగా 'డ్రాపర్' ఉండటం వలన, యిది మరింత పొదుపు. ఎందువల్లనంటే, 'డ్రాపర్' వలన కావలసిన దానికన్న ఒక్క చుక్క గూడా వృధా కాదు. అందువలన, పొదుపు అవటం మాటే కాకుండా, బట్టలకు నీలపు తంగురాదు.

| | |
|---|---|
| 'టెరీన్' | ✓ |
| 'టెరీన్'/కాటన్ | ✓ |
| నైలాన్ | ✓ |
| ఊలు | ✓ |
| సిల్కు | ✓ |
| నూలు | ✓ |

**అన్ని రకాల బట్టల కోసం**

మాక్సిమ్ మీరు అన్ని రకాల బట్టల కోసం వాడవచ్చు నిరభ్యంతరంగా, 'టెరీన్', 'టెరీన్'/కాటన్, నైలాన్, ఊలు, సిల్కు, యింకా నూలు, మరి ఏ యితర బట్టలనైనా సరే మాక్సిమ్ ఎంత తెల్లగా చేస్తుందంటే, అవి కొత్త వాటిలాగ కనిపిస్తాయి. అది గాకుండా, మాక్సిమ్ వాడటం వలన బట్టలపై మచ్చల్లాంటివి పడవు.

**వాడటం ఎంతో వీలు.**

మాక్సిమ్ వాడటం ఎంతో వీలు. మొదట బట్టల్ని సబ్బుతోగాని లేక డిటర్జంట్‌తోగాని బాగా ఉతికి, బాగా జాడించండి. తరువాత, ఒక బాల్చీ (5 లీటర్లు) మంచి నీళ్ళలో 10-15 మాక్సిమ్ చుక్కల్ని కలపండి. (బట్టలు బాగా మురికిగా ఉంటే మరి కాసిని ఎక్కువ మాక్సిమ్ చుక్కల్ని కలపండి.) తరువాత, బట్టల్ని 10-15 నిమిషాల వరకూ నాననియ్యండి. మళ్ళా పిండి, జాడించకండి. బట్టల్ని ఎండటం కోసం ఆరవెయ్యండి.



మాక్సిమ్ పైన మీరు పెట్టిన ప్రతి పైస ఖర్చూ, ఫలితం రూపంలో మీకు ముడుతుంది.




GMM.53 TEL

*Regd. T.M. Geoffrey Manners & Co. Ltd.

[illegible]
వ్వుతు నడిచాడు భాస్కర్రావు.

'రాణీగారు పాపం అలిసిపోయినట్టు న్నారు. రాజాగారువెళ్ళి పనిలో సాయ పడ్తున్నారు.'

'ఛీ! ఛీ! ఏం మనుషులు' రామనాథం గారి మాటలకి విసుక్కుంటూ తన సీట్లో కూలబడ్డాడు భాస్కర్రావు.

'పాపం! ఆఫీసైపోయింది. లేకపోతే ఇంకే విధంగా సాయపడేవాడో!' రామనాథం గారి మాటలు మరి వినలేక తర్వాతి లెటరు టైపు చేయడంలో పడింది నిలయ. ఆ శబ్దంలో కల్సిపోయాయి ఆయన మాటలు. ఒకపక్క చెల్లెలింట్లోంచి వెళ్ళిపోయిందన్న బాధ, మరోప్రక్క తండ్రి ఆరోగ్యం గురించి దిగులూ వీటితో మనశ్శాంతి లేకుండా ఉన్న తమ ఆఫీసులో ఈ అసహ్యకరమైన మాటలు, అనుమానపు చూపులు కూడా భరించాల్సి వస్తోంది. తనేమైనా సరదాకోసం, కాలక్షేపంకోసం ఉద్యోగం చేస్తోందా? తప్పనిసరిగా రోజులు గడపడంకోసం చెయ్యక తప్పదు కాబట్టి చేస్తోంది. తన పరిస్థితి ఈ ఆఫీసులో అందరికీ తెల్సు. మరి ఉద్యోగం చేసేటప్పుడు నలుగురితోనూ ఆఫీసులో మాట్లాడక తప్పుతుందా? భాస్కర్రావుది మంచి హృదయం. తను దిగులుతో బాధపడుతోందని, అప్పుడప్పుడు ఏవో ఒకటి తన యోగక్షేమాలు అడుగుతుంటాడు. ఏదైనా సహాయం చేద్దామని చూస్తాడు. అదికూడా తప్పేనా? ఈమధ్య ప్రతిరోజూ భాస్కర్రావునీ, తననీ కలిపి ఏవో మాటలు అంటూనే ఉన్నాడు రామనాథంగారు. మళ్ళీ, ఆయనతో తను మాట్లాడితే మాత్రం సంబరంతో ఇంతెత్తున లేస్తాడు. ఒక్క ఆయనతోనే తను మాట్లాడాలి. మరెవరితోనూ మాట్లాడకూడదు. మరెవరూ వొచ్చి తనని పలకరించకూడదు. అదీ ఆయన ఉద్దేశం. ఛీ! ఛీ! ఏం మనిషో. తనెంత మంచిగా ఉన్నా కూడా ఉద్యోగం చేస్తున్నందుకు అందరికి లోకువే. తన తండ్రి వయసువాడా రామనాథంగారు. తనతో సరసాలాడాలని చూస్తాడు. అదే, భాస్కర్రావు తనతో మామూలుగా ఒకమాట మాట్లాడితే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు, మేనేజర్ని చుట్టూ పెంపుడుకుక్కలా తిరుగుతూ కాకా పడుతుంటాడు. వాళ్ళమీదా వీళ్ళమీదా ఏవేవో చెప్తూ కబుర్లు చేరవేస్తుంటాడు. ఆ మేనేజరీయన చెప్పిందల్లా నమ్ముతాడు. అందుకే రామనాథంగారంటే ఆఫీసులో అందరికీ భయమే. మనసులో ఇష్టం లేకపోయినా వంగివంగి సలాములు చేస్తారు.

ఐదుగంటలకి ఇంటిమొహం పట్టింది నిలయ.

దారిలో కనిపించాడు మధు. 'అబ్బ! మళ్ళీ ఇన్నాళ్ళకి కనిపించారు. అలా ఉన్నారేం? ఒంట్లో బాగు లేదా?'

'నిక్షేపంలా ఉంది.'

'ఓహో అయితే ఇదంతా మనసు మహాత్యం అన్నమాట.'

'అంటే?'

'అంటే మీ మనసు ఇవాళ బావున్నట్టు లేదని అర్థం.'

'అబ్బ! ఎలా కనిపెట్టగలిగారు ఒక్క క్షణం మొహం చూసి.'

'ఊ... మీనాన్నగారి ఒంట్లో ఎలా ఉంది?'

'ఏవిటో ఇదివరకటికంటే సీరసించి పోయారు. మందులేం పట్టినట్టు లేవు. భయంగాఉంది నాకు.' చివరిమాట అంటున్నప్పుడు నిలయ కళ్ళల్లో నీళ్ళు మెరిశాయి.

జాలి ముంచుకొచ్చింది మధుకి.

'జస్టు, వన్ మినిట్... ఈ పక్కవీధిలో మొదటి మేడే మా ఇల్లు. నా మెడికల్ బేగ్ తీసుకొస్తాను. మీ నాన్నగార్ని చూస్తాను.'

ఆశ్చర్యంగా చూసింది నిలయ. అంతలోనే తెలుసుకుని 'ఈ దీనురాలు ఫీజు ఇచ్చుకోలేకపోతే' అంది చూపుడు వేలితో సుతారంగా పెదాలమీద కొట్టుకొంటూ.

'ఇవ్వకపోడమే నాక్కావల్సిందీను. రండి. మా ఇల్లు చూద్దురుగాని. అట్టే దూరం నడిపించన్లెండి. అదిగో ఆ కనిపించే గులాబీరంగు మేడే.'

టక్కున ఆగిపోయింది నిలయ.

'ఏం? ఆగిపోయారు?'

'ఆ ఇల్లు... అది చంద్రశేఖరంగారిల్లు కదూ!'

[illegible]

'ఆ!' భయంగానూ, విస్మయంగానూ అతని కళ్ళల్లోకి చూసింది నిలయ.

చంద్రశేఖరంగారా ఊళ్ళో పెద్ద పేరున్న లాయరు. కావల్సినంత ఆస్తి, పలుకుబడీ ఉన్న మనిషాయన,

'క్షమించండి. మీరేమీ అనుకోకపోతే నేనిక్కడే నిలబడతాను. మీరు లోపలికి వెళ్ళిరండి.'

'అబ్బే! అదేం కుదరదు. నేనేం మీకు కాఫీలూ, టిఫిన్లూ ఇచ్చి మొహమాట పెట్టన్లెండి. మిమ్మల్ని వీధిలో నిలబెట్టి వెళ్తే నా మనసుకి బావుండదు!'

తప్పనిసరిగా అతని వెనకే నడిచింది నిలయ.

ఖరీదైన ఫర్నిచరుతో డ్రాయింగు రూమ్ అందంగా అలంకరించబడుంది. సోఫాలో కూర్చునున్న మధు తల్లి సరస్వతమ్మ, అడుగుల సవ్వడికి తలెత్తి చూసింది.

'కూర్చోండి, వన్ మినిట్.' అంటూ తన గదిలోకి వెళ్ళాడు మధు. మధు వెనకే సరస్వతమ్మ కూడా వెళ్ళింది, 'ఎవర్రా మధూ ఆ అమ్మాయి?'

'స్నేహితురాలు. ఎవరమ్మాయో చెప్పినా నీకు తెలియదు లేమ్మా!'

'నీతో చదివిందా?'

లేదు, బి. ఏ. ప్యాసయి ఉద్యోగం చేస్తోంది. వాళ్ళ నాన్నగారికి చాలా రోజుల బట్టి జబ్బుగా ఉంది, ఓ సారి చూద్దామని.'

'హోహో! అయితే చాలా రోజుల్నించీ నడుస్తోందన్న మాట కథ.'

'అమ్మా!' వ్యంగ్యంగా అన్న తల్లి మాటకి విసుగ్గా చూశాడు మధు. ఆ సంభాషణ చెవుల్లో పడ్డ నిలయకి ముళ్ళమీదున్నట్టే అనిపించింది, ఇంతలోనే బయటికి వచ్చాడు మధు.

గారేజీలోంచి ఎంబాసిడర్ బయటకి తీశాడు.

'రండి' అంటూ ఫ్రంటుడోర్ తీసి పట్టుకున్నాడు. ఇబ్బందిగా చూసింది నిలయ. 'నేను నడిచెళ్ళి పోతాను'

గట్టిగా నవ్వాడు మధు. 'నేనేం మిమ్మల్ని మొయ్యనుగా. ఈ కారు మోస్తుంది. మీరు కూర్చున్నంతమాత్రాన అరిగిపోదు, కర్గిపో

పోదు. 'అసలు నా అంతట నేనే మీ ఇంటి కొస్తాననటం నాదే తప్పు' బుంగమూతి పెట్టాడు మధు.

మారు మాట్లాడకుండా కార్లో కూర్చుంది నిలయ.

మధు గురించి తండ్రితో యేమని చెప్పాలా అన్న ఆలోచనలో పడింది.

నిలయ వెనకే ఇంట్లోకి నడిచాడు మధు.

ఉన్న ఒక్క కుర్చీ తండ్రి మంచానికి దగ్గిరగా వేసి 'కూర్చోండి' అంది.

కూతురివేపు ప్రశ్నార్థకంగా చూశాడు శివరామయ్య.

కొద్దిగా తడబడింది నిలయ.

'అదే నాన్నా! డాక్టరు ... అయరుగా రమ్మాను. ఈయన డాక్టరు' శివరామయ్య మొహంలో ఆనందం కొట్టవచ్చినట్టు కనపడింది. 'పరీక్ష చెయ్యడానికి వచ్చావా బాబూ! చూపుకూడా సరిగ్గా ఆనట్లేదు. ఇంకెంతోకాలం ఈ జీవుడుంటాడని నమ్మకంలేదు బాబూ!'

పుల్లల్లా కాళ్ళూ, చేతులూ, పీక్కుపోయిన మొహం, లోపలికి పోయిన కళ్ళు ఎముకల పోగుమీద చర్మం కప్పినట్టున్న ఆయన శరీరం చూస్తూనే మధుకి జాలి వేసింది. బాగా పరీక్ష చేశాడాయన్ని. స్టెతస్కోపు తీసుకుని లంగ్స్ చూశాడు.

'ఇంక ఏ మందులేసినా నా దేహానికి పనిలేదు బాబూ! కాని అమ్మాయి పట్టుదలతో డబ్బు ఖర్చుపెడుతోంది. వద్దంటే బాధపడుతుంది...'

'ఊరుకో నాన్నా! ఇప్పుడవన్నీ ఏందుకు?'

కూతురి మాట పట్టించుకోకుండానే చెప్పి అన్నాడాయన 'నా బాధంతా దీన్ని ఒంటరిదాన్ని చేసిపోతున్నాననే. ఒక అయ్య చేతిలో పెట్టి పోతే నాకూ తృప్తిగనే ఉంటుంది. కానీ ఏదీ ... నాకోరిక తీరే దెప్పుడు? ఈ పిల్లో అబ్బాయి ఉంటే వీంతో సుఖపడేది. స్...భగవంతుడు'

'మీరు బాధపడకండి. మీ అమ్మాయి గురించిన దిగులు పెట్టుకుని మనసు పాడు చేసుకోకండి. విశ్రాంతి తీసుకోండి'

బలానికో ఇంజక్షను ఇచ్చి చేతులు కడుక్కొందుకు లేచాడు మధు. నిలయ ప్రస్తుతం వాడుతున్న మందుల వివరాలు అడిగి కనుక్కున్నాడు. 'ఉండండి కొంచెం కాఫీ తీసుకుని వెళ్ళురుగాని.' అంటూ గబగబా వంటింట్లో కెళ్ళింది నిలయ.

మరి కొంచెంసేపట్లో రెండు గ్లాసుల్లో కాఫీ తీసుకొచ్చి ఒకటి మధుకిచ్చి, రెండోది తండ్రి కిచ్చింది.

'మీరు...'

'ఉహూ...నేను తాగను' అంది చిన్నగా.

'ఇంకో ఖాళీగ్లాసు తీసుకురండి.'

'అవురిస్తే పేగుల్లెక్కడతారు మీరు.' నిరుకోవంతో అతనికొక్కడికే వినపడేటట్టు అంటూ వెళ్ళి ఖాళీ గ్లాసొకటి తెచ్చింది నిలయ. అందులో నిలయకోసం సగం పోసి మిగతాది తను తాగాడు మధు. కళ్ళతోనే అతనికి థాంక్స్ చెప్పింది నిలయ. వెళ్ళిపోయే ముందు, కారెక్కుతూ 'ఫీజు చెల్లించకోలేదని అనుకోకండి. ఆప్యాయతలాంటి కాఫీ ఇచ్చి మీ ఋణం తీర్చేసుకున్నారు. ఇప్పుడు మీరు నాకేం బాకీలేరు.' అంటూ చిన్నగా నవ్వాడు మధు.

కారు మలుపు తిరిగేవరకూ అలాగే చూస్తూ నిలబడి తరవాత లోపలికి నడిచింది నిలయ.

(ఇంకా వుంది)




రచన, చిత్రాలు: కాలిపు సోమరాజు

## ప్రఫుల్ల



శ్రీమతి ప్రఫుల్ల గోవాలో జన్మించేరు. బొంబాయి జె. జె. స్కూలులో చదివేరు; స్వర్ణపతకం గెల్చుకన్నారు. బొంబాయి ఆర్ట్ సొసైటీవారి రజత పతకం గెల్చుకన్నారు. వీరికి అనేక జాతీయ అంతర్జాతీయ బహుమతులు, సన్మానాలు లభించేయి. స్కాలర్‌షిప్‌తో ప్యారిస్ వెళ్ళేరు. అక్కడకూడా వీరి చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. దేశ విదేశాల చిత్రప్రదర్శనల్లో వీరి చిత్రాలు ఉన్నాయి.

ఈమె నిరంతరం చిత్రాలు గీస్తూనే ఉంటారు. ఆహారం కూడా తీసుకోకుండా 22 గంటలు పెయింట్ చేసేరు. 1955లో మొట్టమొదటగా వీరి చిత్రాలు ప్రదర్శిత మయ్యేయి. అప్పటినుంచి 18 సార్లు ప్రదర్శిత మయ్యేయి.

మొదట్లో ఈమె కాంగ్రా శైలి వల్ల ప్రభావితులయ్యేరు. వీరిప్పుడు పోర్ట్రెయిట్, లేండ్ స్కేప్, స్టిల్ లైఫ్ చిత్రాలు వేస్తుంటారు. కోణార్క్, అజంతా, దక్షిణ భారతదేశ పందరి దేవాలయాల చిత్రమాలలు వీరు రచించేరు. భిత్తి చిత్రాలు కూడా వేసేరు.

సంగీత నాట్యాభినయములందు కూడా వీరికి అభిరుచి ఎక్కువ. సంగీతజ్ఞానం వీరికి తల్లినుంచి వారసత్వంగా లభించింది.

# వారఫలం

## 15-6-1973 శుక్రవారం మొదలు 21-6-1973 గురువారం వరకు

**మేషం** —అన్నివ్యవహారాలుఅనుకూలంగాఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలించగలవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం** —మీ కార్యక్రమాల్లో వ్యతిరేకత యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం** :—భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో అనవసరమైన శ్రమ కలుగుతుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**కర్కాటకం** —ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురి కాగలరు. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. వారం మధ్యలో ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం**.—వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసములోకూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు—నూతన విషయాలను తెల్సుకొంటారు. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**కన్య**:—మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధువులు సహాయం చేస్తారు.

**తుల** —వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థి వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** —మీ ఆలోచనలు ఫలిస్తాయి.సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో పోటి వారి పోటీ తగ్గుతుంది. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు**:—వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మకరం** —మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం** :—వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మీనం** :—వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

—మహేంద్ర

నా మనస్సేమీ బాగులేదు. ఆ మాట కొస్తే నా మనస్సెప్పుడూ బాగుండదు. కాని ఇవేళ ఉన్నంత అస్తవ్యస్తంగ నా మనసులోని ఆలోచనలు మరెప్పుడూ లేవు. ఇప్పటి నా మనస్సుకన్న సముద్రం నయం!

సుధానిర్మల నా స్నేహితురాలు. ఆ అమ్మాయి పెళ్ళయి, వెళ్ళిపోయేవరకు మే మిద్దరం చాల స్నేహితులం. అసలు ఆమెకు నాకు మధ్య దాపరికాలు, రహస్యాలు ఉండేవికావు. మా స్నేహంలో అసూయ, కల్మషం అస్సలు వుండేవి కావు. ఇన్ని మాట లెందుకు? సుధానిర్మల స్త్రీ, నేను పురుషుడిని అనే భేదభావం కూడ మాలో ఉండేది కాదు.

అలాంటి సుధానిర్మల ఇవేళ కనిపించింది.

నేను మొదట్లో ఉద్యోగం వెలగబెడుతున్న రోజులలో సుధానిర్మల వాళ్ళ ఇంటిలో అద్దెకుండేవాడిని. అప్పుడామెతో పరిచయం స్నేహంగ బలపడింది. అయితే ఆ స్నేహం ప్రేమగ స్థిరపడాలని ఆమె, నేను కూడ అనుకోలేదు. అంత స్వచ్ఛమైన స్నేహం అది!

'నువ్వు ఇంత స్నేహంగ వుంటున్నావు కాని, రేపు పెళ్ళయి వెళ్ళిపోతే నేను గుర్తుంటానా సుధా? గుర్తున్నా పలుకరిస్తావా??' అడిగేవాణ్ణి నేను.

'దాని కభ్యంతరమే వుంటుంది?' ఎదురుప్రశ్న వేసేదామె.

'మీవారికి నన్నేమని పరిచయం చేస్తావు?'

'భయమేం వుంది? స్నేహితుడివనే చెపుతాను.'

'ఏమోలే! అన్నయ్యంటావేమో' అనుకున్నాను.'

'అంత పిరికిదాన్ని కాదు రవీ నేను!' అనేది సుధానిర్మల.

అలాంటి సుధానిర్మల ఇవేళ కనిపించింది.

నాతో మాట్లాడినా, కలిసి నవ్వినా, షాపింగ్‌కు వచ్చినా ఇంట్లో ఏమనేవారు కారు. మేం ఇద్దరం సినిమాలకు కూడ వెళ్ళేవాళ్ళం.

మొత్తానికి—నేనన్నా నా స్నేహం అన్నా ప్రాణం ఇచ్చేది సుధానిర్మల.

అలాంటి సుధానిర్మల ఇవేళ కనిపించింది.

కనిపించి, నన్ను చూసి—చూడనట్లు వెళ్ళిపోయింది. నేను పలుకరిద్దామని ఆమె వైపు వెళుతుంటే త్వర త్వరగ నడిచి కారెక్కి వెళ్ళిపోయింది.



ఆమె సుధానిర్మల కాదని సరిపెట్టుకుందామనుకున్నాను. ఇది వరకు కూడ ఆమె ఒకసారిలా వెళ్ళిపోతే, ఆరోజు ఆమె ఆమెకాదని ఊరుకున్నాను. కాని ఇవేళ—స్పష్టంగ చూశానామెను!

సుధానిర్మల గులాబిలా వుండదు. గులాబీయే సుధానిర్మలలా వుంటుంది. ఆమె అందంగ వుండదు. అందమే ఆమెలా వుంటుంది. ఏదైనా విషయంలో నైనా పొరపాటు పడవచ్చునేమో, కాని ఆమె విషయంలో ఎలా పొరపాటు పడతాను?

నేను చాలా పనులు చేద్దామనుకుంటాను కాని వాటిలో చాలాపనులు చేయలేను. అటువంటి వాటిల్లో సుధానిర్మల పెళ్ళికి అటెండ్ కాలేకపోవటం ఒకటి. సరిగ్గా నాలుగురోజుల కాటు పెళ్ళనగా నాన్నగారికి సీరియస్‌గ వుందని టెలిగ్రాం రావటంతో ఆ తరువాత నాన్నగారు పోవటంతో నేను మా వూరిలోనే వుండి పోవటం జరిగింది. నేను తిరిగి ఆవూరు వచ్చేసరికి ఆమె కాపురానికి వెళ్ళిపోయింది.

ప్రస్తుతం సుధానిర్మల కాలేజీల [illegible] అర్ధాంగి. స్టేటస్, గలమనిషి భార్య. నాకన్న అన్ని విధాల గొప్పమనిషి భార్య ఆమె. [illegible]

చూడకుండా వెళ్ళిపోయిందేమో అనిపిస్తోంది కాని ఆమె అలాంటి మనిషికాదని మరో మనసు చెపుతోంది.

'గెడ్డం ముదిరినా నీ మనస్సు ముదర లేదు రవీ. నువ్వొట్టి అమాయకుడివి' అని పదే పదే చెప్పే సుధానిర్మల ఇలా మారి పోయిందంటే నమ్మకం కుదరటంలేదు.

నమ్మక ఏం చేస్తావని అడుగుతోంది మనస్సు. అన్నిరోజులు స్నేహంచేసి ఆమె అర్థం చేసుకున్నది ఇంతేనా అని నిలేస్తోంది మరో మనస్సు.

ఇటు ఒక కెరటం.

అటు ఒక కెరటం.

అంతులేని కెరటాలు. అందుకే ఇవేళ సముద్రం కన్న మిన్నగ వుంది నా మనస్సు.

* * *

వారం రోజుల తరువాత—

ఒక సాయంత్రం కారుదిగి, ఫ్రెండ్స్ కార్నర్ లోనికి సుధానిర్మల వెళ్లటం చూసి నేనూ వెళ్లాను.

అసలు ఆమెతో ఇంక మాట్లాడ కూడదనుకున్నాను. ఆమె వైపు చూడకూడ దనుకున్నాను. ఆమె పలకరించినా బదులు చెప్పకూడదనుకున్నాను. కాని—కాని ఆమె కనిపించగానే నేను తీసుకున్న నిర్ణయాలన్నీ గాలిలో కలసి పోయాయి. నాకు కోప మయితే వస్తుందిగాని, అది వింతో సేపు నిలువదు. అందులో ఆమె విషయంలో అస్సలు నిలువదు.

ఆమె ఒక చీర తనకు నప్పుతుందో లేదోనని తన చేతులపై వేసుకుని చూసు కుంటుంటే 'తీసుకో సుధా! ఆ చీర నీకు బావుంటుంది' అనేశాను. ఆమె నన్ను చూసి నవ్వి. ఆ చీర, దానికి మ్యాచయ్యే బ్లౌజు పీసు తీసుకుని ప్యాక్ చేయించింది.

'నన్ను మరచి పోయావనుకున్నాను సుధా!'

ఆమె బిల్లు చెల్లిస్తూ నాకు సమా ధానం ఇవ్వలేదు.

'నాతో ఇదివరకులాగ స్నేహంగ వుండ టానికి నీకేమైనా అభ్యంతరమా సుధా!' అడిగాను నేను.

'తరువాత మాట్లాడుకుందాంగాని, ని ల్లడపియ్యి!' నాతో ఆమె ఇటీవల మాట్లా డిన మొదటి వాక్యం అది.

'అయితే మా ఇంటికొస్తావా సుధా!'

## మగజాతి కథ

అని అడుగుతూ నా విజిటింగ్ కార్డు తీసి ఆమెకిచ్చాను. ఆమె సమాధానం చెప్పకుండా వచ్చింది.

నవ్వటం ఆడ వారి సొత్తు. ఆ నవ్వు విందుకు నవ్వారో తెలీక తికమక పడటం మగవారి జన్మహక్కు. ఆమె మా ఇంటికి వస్తావని నవ్విందో రావని నవ్విందో నాకు తెలియలేదు.

'తరువాత తీరుబడిగ ఆలోచిద్దువు గానిలే! నేను వెళ్ళాలి' నాతో ఆమె మాట్లా డిన రెండో వాక్యం అది. ఇద్దరం కారు దగ్గరకు వచ్చేశాం. ఆమె కారులో కూర్చుంది.

'సరే, మళ్ళా దర్శనం విప్పుడు?' అంటూ చెయ్యి ముందుకు జాచాను కర చాలనం కోసం. ఆమె, నేను కలుసుకుని విడిపోయేటప్పుడు షేక్‌హ్యాండు తీసుకో వటం మా కలవాటు.

'మాలిన్యం అనేది మనస్సులో లేకుండా వుండాలి. షేక్‌హ్యాండు తీసుకున్న మాత్రాన నా పాతివ్రత్యం ఏమీ పోదులే?' అనేదామె అప్పట్లో.

కాని ఇప్పుడు?

ఒక నవ్వు మాత్రం నా మీద పారేసి కారు స్టార్టు చేసి వెళ్ళిపోయింది. ఆ కారు దుమ్ము రేపింది.

సుధా నిర్మల విందుకిలా మారిపోయింది? కల్మషం; స్త్రీ పురుష భేదం లేని మా స్నేహానికి విందుకిలా బ్రేక్ పడింది??

* * *

ఆమె మా ఇంటికి వస్తుందనే ఆశతో నాలుగు రోజుల నుండి రోడ్డు సర్వే చేయటం మానేసి త్వరగా ఇంటికి వచ్చే స్తున్నాను. అయిదవరోజు కూడ అలాగే ఇంటికి వచ్చే సరికి—

సుధా నిర్మల రాలేదు. ఆమె వ్రాసిన ఉత్తరం వచ్చింది.

'రవీ!

నన్ను, నా ప్రవర్తనను చూసి నేను చాల మారి పోయాననుకుంటున్నావు కదూ! నేను ఏమీ మారలేదు. వెనుకటి సుధా నిర్మలనే! నువ్వన్నానీ నీ స్నేహం అన్నా ప్రాణం ఇచ్చే సుధా నిర్మలనే!

నిన్ను చూసి కూడ నువ్వెవరో తెలియ నట్టు వెళ్ళిపోతే నువ్వు బాధపడతావని తెలుసు. ఈ ఉత్తరం అందేవరకు నా కోసం ఎదురు చూస్తావనీ తెలుసు. కాని ఏం చేయను?

నేను తలచుకుంటే నీ వద్దకు రాగలను. కాని అలా దొంగతనంగా వచ్చి కలవటం నాకిష్టం లేదు. ఇతరులు మనవైపు వేలెత్తి చూపారని బాధ పడేకన్న అసలు ఇతరులను మనవైపు వేలెత్తకుండ జాగ్రత్త పడటం మంచిది కదూ!

'సృష్టిలో తీయనిదిదే స్నేహమో'నని కృష్ణశాస్త్రి రాశారు. నిజమే! కాని మన సమాజంలో ఆ స్నేహానికి (అందులో అది స్త్రీ పురుషుల మధ్య స్నేహమయితే మరీను!) హద్దులు కావాలని రాయటం మరచి పోయాడాయన.

ఎవరెన్ని కబుర్లు చెప్పినా, వింత పురో గమించావని లెక్చర్లిచ్చినా ఆడది ఆడదే! మగవాడు మగవాడే!!

మన సమాజంలో పురుషుని లాగ స్త్రీ జీవించలేక పోతోంది. మగవానిలాగ విచ్చల విడిగ, విశృంఖలంగ ఆడది బ్రతక లేక పోతోంది. కారణం?

దీనికి కారణమెవరో తెలుసా రవీ!

మీ మగవాళ్ళు!

అన్నట్టు—మావారిని నువ్వు చూడ లేదు కదూ! ఆయన చాలా అందంగ వుంటారు. వారికి ఆస్తి, అంతస్తు అన్నీ వున్నాయి. నేనంటే చాల ప్రేమ. ఆడదాని కింత కన్న ఏం కావాలంటారు అమ్మ వాళ్ళారు. ఆడదానికింత కన్న మరేమీ అక్కర్లేదూ!

వ్యక్తిత్వాన్ని, చిన్న చిన్న ఇష్టాలను కూడ చంపుకుని ఏ ఆడదైనా అసలు ఎందుకు బ్రతకాలి?

నేనిలా అంటే మా ఆడవాళ్ళు ఏడు స్తారు కాని, ఆంధ్ర దేశంలో చాలమంది ఆడవాళ్ళకి వ్యక్తిత్వాలు లేవు.

చిన్న చిన్న విషయాలను నేను భూతద్దంలోంచి చూసి అనవసరపు హైరాన పడుతున్నాననుకుంటున్నావేమో!

ఏం చెప్పను రవీ!

మా వారికి నాపై ఏదో అనుమానం. నేను పరాయి మగవాళ్ళతో మాట్లాడితే జెలసీ. నేనొక్కత్తెనే బజారుకి వెళ్ళానని తెలిస్తే కోపం.

మొన్న నెవరియింటి? తెలుసా? ఎవరో అమ్మాయిని తీసుకొచ్చారు. తన స్నేహితురాలట. ఇద్దరూ ఎంతో చనువుగ కబుర్లు చెప్పుకున్నారు.

విడిగా వారిద్దరి గురించి నాకేవిధమయిన అనుమానం రాలేదు, కాని ఏమంటారో చూద్దామని ఆహారకంగా మాట్లాడను. ఇక చూసుకో నాకు వి శా ల

హృదయం లేదుట. మనుషుల వర్ణం చేసుకోవటం రాదుట. స్త్రీ పురుషులిద్దరు మాట్లాడుకుంటేనే తప్పు పట్టే రకముట ఒక మాటకాదు. కొన్ని వందల మాటలు!







మీరు త్రాగండి, మీ అతిధులకివ్వండి—
చవులూరించే మరపురాని పానీయం.
శుద్ధి చేయబడిన స్వచ్ఛమైన చక్కెరతో
ప్రత్యేకంగా తయారు చేయబడింది.




# కిస్మత్

అత్యంత రుచికరమైన గొప్ప పానీయం

IMPRESSIONS-482

# ఎవరు ధన్యజీవి?



బులుసు వెంకటరమణయ్య—ధర్మపథం

కోటానుకోట్ల ప్రజలలో జీవితాన్ని ఏ చీకూ, చింతా లేక చక్కగా గడుపు కొనేవారు ఏ కొద్దిమందో ఉంటారు.

జీవితాన్ని సుఖంగా గడపడానికి ధనం ముఖ్యమే. ధనం వుంటే జీవితం దైన్యం లేకుండా కొనసాగుతుంది. కాని, ధనం ఉన్నంతమాత్రాన జీవితం సుఖమయమని అనుకోకూడదు.

కొందరు ధనవంతులే కావచ్చు. అందువల్ల దైన్యం లేకుండా — అంటే డబ్బు విషయమై ఏట్టి ఇబ్బందీ లేకుండా కాలు మీద కాలు వేసుకుని హాయిగా కాలం గడప గల స్తోమత ఉండవచ్చు.

అయినా— సుఖాన్ని అనుభవించే అవకాశం లేకుండా రోగంతో తీసుకుంటూ ఉన్నవారికి— ఎంత డబ్బు ఉన్నా ప్రయోజనం లేదు. వారికి — రోగంతో బాధపడే కంటే ప్రాణం పోతేనే మేలు అనిపిస్తుంది.

ఇక ఏ రోగమూ, రొప్పూ లేకుండా ఉక్కుగుండువలె ఉండేవానికి — డబ్బు లేక దైన్యంగా జీవించవలసి వస్తే అదీ ఎంతో బాధగానే అనిపిస్తుంది.

దైన్యం లేకుండా జీవితం గడపడం, అవసాన సమయంలో ఏట్టి శ్రమ లేకుండా ప్రాణాలను విడవడం ఎంతో అదృష్టశాలికిగాని సాధ్యపడదు. పెద్దలు—

'అనాయాసేన మరణం
వినా దైన్యేన జీవనమ్,
అనారాధిత గోవింద
పదాబ్జస్య కథం భవేత్.'

అని ఈ విషయాన్నే చెప్తూ ఉంటారు.

మానవుని జీవితం ధన్యమై ఉండాలంటే— అతడు బ్రతికి ఉన్నంతకాలమూ దైన్యం లేకుండా— ఏవిధంగానూ లోపం లేకుండా-కొంచెమైనా ఆయాస పడకుండా ప్రాణాలను విడిచిపెట్టాలి.

ఇట్టివారి జీవితమే ధన్యమైనది!

ఈ శ్లోకంలో మరొక విషయం కూడా ఉన్నది.

పైవిధంగా జీవితం జరగడానికి ఎంతో అదృష్టం ఉండాలి! అది ఎలా లభిస్తుంది?

అట్టి అదృష్టం భగవంతుడైన విష్ణుమూర్తియొక్క పాదపద్మములు ఆరాధన వల్లనే లభిస్తుంది.

అందువల్ల సుఖజీవనంకోసం అందరూ పరాత్పరుని పాదపద్మాలను ఆరాధించడం అవశ్యం. ●

---

# మగజాతి కథ

ఆయన కప్పుడు చాల కోపం వచ్చింది. అందుచేత ఆయనగారి భాషా జ్ఞానం నాకు బాగ తెలిసింది.

నేనడుగుదా మనుకున్నాను—'మరి నా మీద తమరెందుకిన్ని ఆంక్షలు విధిస్తున్నారు స్వామీ!' అని.

కాని అడగలేక పోయాను. ఎందుకో తెలుసా?

నా మెడలో వారు మంగళసూత్రం కట్టారు, కొనుక్కున్న పశువు మెడలో త్రాడు కట్టినట్టు, కాని వారి మెడలో నేనేమీ కట్టలే...

నన్ను పెళ్ళి చేసుకుందుకు ఆయన పదివేలు తీసుకున్నారు. నేనేదో బాకీ వున్నట్టు పదివేలు, ఆ పదివేలతో బాటు నా అందం, మనసు, నా ఇష్టాలు, అభిరుచులు—అన్నీ ఆయనకు సమర్పించుకున్నాను— అలాగే సమర్పించుకున్న ఆడదానికి ఇంకా మగవాడిని ప్రశ్నించే అధికారం ఉందంటావా? అసలు—మన సమాజాన్ని, సంఘాన్ని కీలు కీలునా వాత పెట్టాలి.

ఆడది, సంఘం, సమాజం ఈ స్థితిలో వుండటానికి కారణం—మగవాడు, మగవాడు. మగవాడు!!!

తన స్వంత చెల్లెల్ని ఎక్కడికైన తీసికెళ్ళమంటే ఏడుపు మొహం పెట్టే మగవాడు — స్నేహితుని చెల్లెల్ని ఎక్కడికయినా తీసి కెళ్ళగలడు!

భార్య ప్రక్కన వుంటే పైస ఖర్చు పెట్టడానికి దడిసే మగవాడు — పరాయి ఆడది ప్రక్కన నిలబడితే చాలు ఎంత డబ్బయినా ఖర్చు పెట్టగలడు!

తన పెళ్ళాం పరాయి వాడితో మాట్లాడితే చాలు మొహం ముడుచుగునే పెద్ద మనిషి—పరాయాడవాళ్ళతో గంటల తరబడి కాలక్షేపం చేయగలడు!

నాకప్పుడప్పుడనిపిస్తూ వుంటుంది—నా కన్నయ్య లెవరూ లేరు కాబట్టి మనిద్దరం స్నేహంగ వుండగలిగామని. ఉంటే ఆయన గారెన్ని ఆంక్షలు విధించే వాడో!

మీ మగవారిని చూస్తుంటే పెళ్ళాయ్యాక నువ్వు కూడ అలాగే వుంటావనిపిస్తోంది. అవును. అలా వుండకపోతే మీ మగతనం పోదూ!

నీతో ఇదివరకులాగ ఎందుకు మాట్లాడలేక పోతున్నానో ఈ పాటికే నీకు తెలిసుంటుంది. మగవారంటే నాకేం కోపం లేదు. మీ ప్రవర్తన అంటేనే కోపం.

కడివెడు అమృతంలో కొంచెం విషం పోస్తే చాలు. ఆ అమృతం కూడా విషమయిపోతుంది. కాని రవి కడివెడు విషంలో ఎంత అమృతం పోస్తే ఆ విషం కూడ అమృతమవుతుందంటావ్?

వీరేశలింగం, చలం—ఇలాటి వారంతా కడివెడు విషంలో పడిన అమృత బిందువులు.

లక్షల కొలదీ వీరేశలింగాలు, చలాలు పుడితే, అప్పుడేమయినా సంఘం బాగుపడుతుందేమో!

అంతవరకు ఆడదాని బ్రతుకు, మగజాతి కథా ఇంతే!

—రాజశేఖరంగారి భార్య. ●

## మీ కమ్మని ముద్దులాటలో, మీ చేతులలో ఆడుకొంటూ మీ పాపాయి మీ ప్రేమను తెలుసుకొంటాడు. దానికితోడు వానికి జాన్సన్స్* యొక్క మృదువైన చర్మ రక్షణ కూడ అవసరమే.

మీరు మీ పాపాయిని ఎత్తుకొని దగ్గరగా తీసుకొంటే, వాడు భయము అనే మాట లేకుండా ఆనందలోకంలో ఉన్నట్టు ఉంటాడు. వానికి జాన్సన్స్ బేబీ పౌడరుతో కూడ సౌఖ్యము కలిగించండి. పాపాయి లేత చర్మమునకు గుడ్డలను మార్చునపుడు, చెమట వలన అసౌఖ్యము కలగకుండా జాన్సన్స్ రక్షణ నిస్తుందని ప్రపంచమంతటా గల తల్లులకు తెలియును. పాపాయి చర్మ రంధ్రములను మూసివేయకుండా ఉండేలా దాని కణములు ప్రత్యేకముగా తయారుచేయబడినవి. దాని సువాసన ఎంతో తేలికగా ఉంటుంది కనుక పాపాయి అదంటే యిష్టపడతాడు.

పాపాయి బట్టలు మార్చునపుడు, స్నానము తరువాత, పడుకోబోయే ముందు జాన్సన్స్ పౌడరు వాడి పాపాయికి సౌఖ్యము కలిగించండి. అలా చేస్తే, పాపాయి రోజంతా చల్లగా, తాజాగా మరియు సౌఖ్యముగా ఉంటాడు.

జాన్సన్స్ పౌడరును ముఖ్యంగా పాపాయిలకని తయారుచేసేము కనుక దానిని అపురూపమైనదిగా తయారుచేసేము. అది అందరికీ బాగుంటుంది. మీరూ ఎందుకు వాడ కూడదు?

పిల్లలకు ఉత్తమమైనది మరియు మీకు కూడ.




* ట్రేడ్ మార్క్.

జాన్సన్ & జాన్సన్ *




విడిదిల్లు హడావిడిగా వుంది.

గాజుల గలగలలూ, పట్టుచీరెల రెపరెపలూ, సిగరెట్ల పొగ, చీట్లపేకా, పిల్లల అల్లరీ, అంతా నానా గందరగోళంగా వుంది. వాకిట్లో కూచుని వున్న సన్నాయి మేళం డోలు తాళ్ళని బిగిస్తూ మధ్య మధ్య దాన్ని ఢమ! ఢమ! మనిపిస్తోంది. మధ్య గదిలో కాఫీ గ్లాసులు పరామర్శించుకుంటున్నాయి. వక్కపొడి పళ్ళాలు అలా చేతులపై నుంచి జారి పోతున్నాయి. క్రొత్త పేకెట్ల నుంచి సిగరెట్లు వో మూల నుంచి మరో మూలకు గాలిలో తేలుతూ వెళ్ళి అందరి చేతుల్లోనూ రాలుతున్నాయి. తలంటుకున్న స్త్రీలు తమ జుత్తు నారబెడుతూ అడపాదడపా తప! తప! మంటూ దులుపుతున్నారు. సిగరెట్ల పొగతో అగరొత్తుల ధూమం పోటీ పడుతోంది. పసిపిల్లల నీళ్ళిసి విసుగుతో తడుముతూన్న తల్లులు, వారి చేత ఆరు న్నొక్క రాగాన్నాలాపింప జేస్తున్నారు.

ఉదయం పదకొండింటికి ముహూర్తం! పెళ్ళికొడుకును ముస్తాబు చేస్తున్నారు. అతన్ని మధ్య మధ్య పెళ్ళికూతురి తమ్ముళ్లూ, చెల్లెళ్ళూ వచ్చి హాస్యాలతో విసిగించి వేదుకున్నారు.

పాలోమంటూ పలహారాల బుట్టలతో పెళ్ళికూతురింటి బంధుజనం వచ్చి పడ్డారు. క్షణాల్లో టిఫిన్లని వడ్డించేరు. యిలా కాఫీలు ముగిసేయో లేదో అలా టిఫిన్ చేయవలసి రావటం కొందరికి నచ్చ లేదు. పలహారాల్ని విడిదిలోకి చేరవేసిన వాళ్ళలోనే మరికొందరు వెళ్ళి మళ్ళీ వెంటనే పొగలు గ్రక్కుతూన్న కాఫీ బిందెతో తిరిగి వచ్చేరు.

పెళ్ళికొడుకు తరపున వచ్చిన బంధువుల్లో భుజంగరావుగారు ముఖ్యులు. వారు సమితి ప్రెసిడెంటు కూడాను. ఉదయాన్నే




పంపినవారు: ధర్మవిజయుడు, సికిందరాబాదు

## విడిదీ-వియ్యాలవారతా

కాఫీ అలా గొంతులోకి జారిందో లేదో యిలా టిఫిన్లని వడ్డించటమూ, ఆ వెంటనే మళ్ళీ కాఫీలు రావటం ఆయనకు సహించలేదు. అంటీ అంటనట్టుగా సుతారంగా ఫలహారాన్ని ముగించేరాయన. వారికి కాఫీగ్లాసు నందించడానికి పెళ్ళికూతురి పినతండ్రి సుందరరామయ్యగారు ముందుకి వచ్చేరు. వారు సహజంగా అమాయకులు.

'అబ్బే! అప్పుడే మళ్ళీ కాఫీ ఏమిటండీ? పదింటికల్లా పంపించండి!' అన్నారు భుజంగరావుగారు.

'మళ్ళీ పంపించడానికి వీలవుతుందో లేదో? అక్కడ క్షణం తీరికుంటం లేదు. మీరు మన్నిస్తే యిక్కడే కొంత కాఫీ వుంచి వెడతాను. విడిదింటి వంట గదిలో మన మనిషున్నాడు. అప్పటికల్లా వేడిచేసి తెచ్చివ్వమని చెబుతాను,' అన్నారు సుందరరామయ్యగారు;

యిది విని భుజంగరావుగారు కస్సుమంటూ లేచారు.

'యిదేం మర్యాదండీ? వియ్యాలవారికి చేయవలసిందిదేనా? ఏ ఉదయమో చేసి పడేసిన కాఫీని మళ్ళీ వెచ్చబెట్టుకుని త్రాగమంటారా?'

సుందరరామయ్య భయపడి పోయారు.

'క్షమించండి బాబూ! నాలిక జారింది. ఏదో పొరపాటున అన్నాను, సరే! అలాగే పదింటికి మళ్ళీ చేయించి పంపుతాను.' అంటూ కంగారుగా కదిలి వెళ్ళారాయన.

భుజంగరావుగారు అరమోడ్పు నయనాలతో మీసాల్ని సవరించుకున్నారు.

స్నానాల గది దగ్గర కుంకుడు గాయలని చిట్లగొడుతూ వేణ్ణీళ్ళలో నానవేస్తూ విడిదింట్లోని ఆడవాళ్ళకందిస్తూందో పెళ్ళికూతురింటి ఆడపడుచు రంగనాయకమ్మగారు. ఆవిడకా పని ఉదయం నుంచీ తెమలటం లేదు. విడిదింట్లోని ఆడవాళ్ళంతా స్నానాలు ముగించేక మిగిలి ఉన్న కాసిన్ని కాయల్ని కొట్టడం పూర్తి చేసి వెళ్ళిపోవటానికి సిద్ధపడిందావిడ. అప్పుడు స్నానానికి వచ్చారో యిద్దరమ్మాయిలు. నాగరికత వారి పాదాల్నుంచి వదనందాకా వెలిగిపోతోంది.

ఆ అమ్మాయి లిరువురూ పెళ్ళికొడుకు పెత్తల్లి కొడుకులు వారి నాన్నగారిక్కడే మంచి హోదాలోనే వున్నారు.

'చూడండి!' రంగనాయకమ్మగారి నుద్దేశించి పలికారా అమ్మాయిలు.

'ఈ కుంకుడు రసం మాకు పడదండీ! వెంటనే మాకో షాంపూ సీసాని పంపించండి! త్వరగా స్నానం చేయాలి. ఉదయం నుంచీ చూస్తున్నాం. అన్ని సౌకర్యాలూ చేసామంటూ గొప్పగా చెప్పుకున్నారేగాని ఓ మంచి సబ్బూ, కనీసం షాంపూని కూడా సమకూర్చలేక పోయారు.'

రంగనాయకమ్మగారసలే పూర్వకాలపు మనిషి. ఆవిడకీ ఆడపిల్లల ధోరణి ఎంతకీ అంతుబట్టలేదు. ఆ షాంపూ అంటే ఏమిటో ఆవిడకసలే తెలీదు.

'షాంపేమిటమ్మా?' మేమంతా ఈ కుంకుళ్ళనే వాడతాం. యింతవరకూ మీవాళ్ళంతా వీటితోనే స్నానాలు చేసేరు.' అందామె చీరచెరగుతో నుదుటిపై నున్న స్వేదబిందువుల్నద్దుకుంటూ.

రంగనాయకమ్మగారు చాలా అమాయికంగా మాట్లాడినా ఆ అమ్మాయిల కది మరోలా స్ఫురించింది. వెంటనే గంయ్! మంటూ లేచారు.

'ఏమిటీ? షాంపేమిటా? మా మొహాలకి షాంపూనే తెలీదంటారా? యింతా ఆ కాయలతోనే తలంటుకుంటే మేమూ వాడాలనుందా? మాకనవసరం! వెంటనే వెళ్ళి మాకో షాంపూ సీసాని పంపించండి!' అంటూ రుసరుస లాడుతూ విసురుగా విడిదిలోకి వెళ్ళిపోయారు. ఆ ఆడపడుచు ఉసూరుమంటూ పెళ్ళికూతురింటికేసి వెళ్ళింది.

'వీళ్ళకి ఉదయంనుంచి చెబుతున్నాను. టౌనుకు పంపించి వారపత్రికల్ని తెప్పించమని! యింతవరకూ అతీగతీలేదు.' అంటూ పెళ్ళికొడుకు చెల్లెలిభర్త విసుగుతో మాటిమాటికీ గొణుక్కుంటున్నాడు. దానిక్కారణం — అతనేదో వారపత్రికకి ఉత్తరం వ్రాసేడట; అది ఆ వారం సంచికలోని ఉత్తరాల శీర్షికలో ప్రచురించబడిందో లేదో తెలుసుకోవాలని అతని ఆరాటం!

ఉదయం పదవ వస్తోంది.

పెళ్ళివారింట్లోని పనులన్నీ చకచకా సాగిపోతున్నాయి. పెళ్ళికొడుకుని తీపికెళ



# రాలిపోతున్న జుట్టును గురించి నేడే ఆలోచించండి.



# రేపటి వరకు ఆగితే తరువాత చింతిస్తారు!

ప్యూర్ సిల్విక్రిన్ నేడే వాడటం ప్రారంభించండి. ఇది శాస్త్రీయమైన పరిశోధనలు జరిపి, పరీక్షింపబడిన ఫార్ముౖలా. ఇది 1) జుట్టు రాలిపోవటాన్ని ఆపి వేస్తుంది. 2) దీనిలో జుట్టు యొక్క కుదుళ్ళలోనికి చొచ్చుకొని పోయి లోపములను పూరించటానికి అత్యావశ్యకమైన 17 ప్రొటీన్లు ఉన్నాయి—జుట్టు తిరిగి ఒత్తుగా మరియు ఆరోగ్యవంతంగా పెరగటానికి సహకరిస్తాయి.



**ప్యూర్ సిల్విక్రిన్ జుట్టు రాలిపోవటాన్ని అరికడుతుందనటానికి ఋజువు.**

వెంట్రుకల కుదుళ్ళలో అతి ముఖ్యమైన అమినోఏసిడ్స్ లేక పోవటం వల్ల జుట్టు పెరుగుదల పలుచగా అనారోగ్యంగా ఉంటుంది. ఈ పరిస్థితిని సరిదిద్దకపోతే అది జుట్టును బలహీన పరచి రాలి పోవటానికి దారి తీస్తుంది.



ప్యూర్ సిల్విక్రిన్ బొట్టు (బాగా పెద్దదిగా చేసినప్పుడు) ఆరోగ్యవంతమైన జుట్టు పెరుగుదలకు అవసరమైన 17 అమినోఏసిడ్స్, సహజమైన ప్రొటీన్లు కలిగి ఉంటుంది. ప్యూర్ సిల్విక్రిన్ వెంట్రుకల కుదుళ్ళ లోతులకు శీఘ్రంగా చొచ్చుకుపోయి మీ జుట్టు తిరిగి ఒత్తుగా, ఆరోగ్యవంతంగా పెరగటానికి ముఖ్యంగా కావలసిన ప్రొటీన్లను అందిస్తుంది.

**ప్యూర్ సిల్విక్రిన్ చికిత్స నేడే ప్రారంభించండి!**

మంచి ఫలితాలకు ప్యూర్ సిల్విక్రిన్ క్రమబద్ధంగా వాడాలి. ప్యూర్ సిల్విక్రిన్ కొలత ప్రకారం తీసికొని రోజు రెండు సార్లు, ప్రతి రోజు పుర్రె అంతా మర్దన చెయ్యండి. మీ జుట్టు చక్కగా పెరగటం ఆరోగ్యంగా కనిపించటం మీరు గమనిస్తారు. కొద్ది కాలంలోనే విశిష్టమైన ప్యూర్ సిల్విక్రిన్ చికిత్స మీ జుట్టుకు దాని సహజ పెరుగుదలను చేకూర్చుతుంది

# ప్యూర్ సిల్విక్రిన్

జుట్టు యొక్క సహజ ప్రొటీన్ ఆహారం

mcm/S/13 tel




(mcm/S/13 tel)

తానికి విడిదింటి లోగిళ్లోకి ముత్యాల పల్లకీ వచ్చి చేరింది. బ్యాండుమేళం జోరులు తీరింది. పెళ్లికూతురింటి జనం ఏవేవో పనులపై హడావిడిగా విడిదింటికి వస్తూ వెడుతూనే వున్నారు. ముహూర్త సమయం చేరువవుతున్నాకొద్దీ విడిదిలో సందడి పెరుగుతోంది.

పదవగానే రిస్టువాచీవంక ఓసారి చూచారు భుజంగరావుగారు. 'కాఫీ యింకా రాలేదేవిటా ?' అంటూ ఆలోచిస్తున్నారాయన. మరో పదిహేను నిమిషాలు గడిచినా కాఫీ యింకా రాకపోవటం చూచి ఓసారి పెళ్లికొడుకు తరపువారి దర్పాన్ని వొలకబోయాలని లేచి నుంచున్నారాయన. ప్రతివ్యక్తి దగ్గరికీవెళ్లి తనకు కాఫీ అందనివైనం గురించి చెప్పుకుంటూ వెళ్లారాయన. క్షణాల్లో విడిదింటిలోని వారందరికీ భుజంగరావుగారికి కాఫీ అందలేదన్న సంగతి తెలిసిపోయింది, ఈ విషయానికి జతగా తమకు షాంపూ అందలేదన్న అమ్మాయిల ఆరోపణ కూడా అందరికీ తెలిసి వచ్చింది.

మావగారి ముందు పరోక్షంగానూ, భార్యా, అత్తగారల ముందు ప్రత్యక్షంగానూ తనకు పత్రిక అందలేదన్న నిరసనా భావాన్ని వెల్లడి చేస్తున్నాడు పెళ్లికొడుకు చెల్లెలి భర్త.

ఈ మూడురకాల వియ్యాలవారి కోరికలు కాస్తా పెళ్లికూతురింటికి ఎపుడో చేరాయి.

భుజంగరావుగారికి కాఫీ నందించాలన్న విషయాన్ని వెడుతూనే పెళ్లింటి వంటగదిలో అజమాయిషీ చేస్తున్న వ్యక్తుల చెవిన వేసి మరోపనిలో మునిగిపోయారు పెళ్లికూతురి పినతండ్రిగారు.

కుంకుడుకాయల్ని కొట్టివెళ్లిన రంగనాయకమ్మగారు సరాసరివెళ్లి విడిదింటిలోని షాంపూసీసా అవసరాన్ని పెళ్లికూతురి తండ్రి జానకిరామయ్యగారికే విశదం చేసింది.

అసలే పల్లెటూరు! ఊళ్లోని కొట్లన్నీ స్వయంగా గాలించినా కూడా జానకిరామయ్యగారికి షాంపూసీసా లభ్యం కాలేదు.

టౌను అక్కడికి ఎనిమిదిమైళ్లు, సైకిలుతో ఎవరినన్నా పంపించి తెప్పించవచ్చుననే ఉద్దేశ్యంతో అద్దె సైకిళ్ల కొట్టువైపు వెళ్లారాయన. కాని అక్కడే సైకిలూ దొరకలేదు. యిక చేసేదేమీ లేక ఉదయాన్నే పత్రికలకోసం టౌనుకు సైకిలేసుకెళ్లిన పాలేరు తిరిగి రాగానే అతన్నే తిరిగి షాంపూకోసం పంపించవచ్చుననే నిర్ణయాని కొచ్చి యింటిమొహం పట్టారాయన.

కాని తీరా యింట్లో కడుగుపెట్టి వెనుదిరిగి చూడగానే సైకిలేసుకెళ్లిన ఆపాలేరు కాస్తా శూన్యహస్తాలతో సైకిల్ని త్రొక్కుంటూ రావటం కనిపించింది.

'ఏం జరిగిందిరా ?' ఆదుర్దాగా అడిగారు జానకిరామయ్యగారు. వియ్యాలవారికి జరగవలసిన మర్యాదల్లో లోపం జరిగిపోతుందేనన్న బాధ వారి కంఠంలో తొణికిసలాడింది.

'మూడుమైళ్లు వెళ్లానో లేదో ముందు చక్రంలో ముల్లు దిగబడిందండీ! ముందుకెళ్లి చేసేదేమిటని వెనక్కి తిరిగొచ్చాను. మరో సైకిలేసుకుని వెడతాను' దోవలో ఏకూమా లేదాయె!' అంటూ కదలబోయాడా వ్యక్తి.

'ఒరేయ్! ఆగాగే ఓ షాంపూసీసా కూడానటా! ఈ సైకిల్ని తీసికెళ్లి రిపేరు చేయించు. షెడ్డులో సైకిళ్లేవీ లేవు. అన్నీ అద్దెకెళ్లి పోయాయి. ఈలోగా ఏదేని సైకిలు తిరిగొస్తే వేసుకెళ్లు! వెళ్లేముందో సారిలావచ్చి వెళ్లు. మళ్లీ ఏకన్నా అవసరం వస్తుందో ఏమో ?' అంటూ పురమాయించి లోనికెళ్లారు జానకిరామయ్యగారు.

ముహూర్త సమయం మరీ దగ్గర పడింది.

విడిదింట్లో భుజంగరావుగారు చిందులు త్రొక్కుతున్నారు. ఆ అమ్మాయిలు విసుక్కుంటున్నారు. పెళ్ళికొడుకు చెల్లెలి భర్త అత్తమామలపై కారాలు — మిరియాలూ నూరుతున్నాడు.

వారపత్రికలూ, షాంపూ సీసాల విషయంలో జానకిరామయ్యగారు తగుచర్య తీసుకున్నారు కాని భుజంగరావుగారి కందించవలసిన కాఫీ విషయంలోమాత్రం పొరపాటు జరిగిపోయింది. వంటకాళ్ల అజమాయిషీలో మునిగి తేలుతూన్న ముఖ్యుల మతిమరపొక్కటే దానికి కారణం. సూత్రధారణ సమయానికి పెళ్ళి పందిట్లోకి వెళ్ళాలన్న ఆతురత వారికుంది. అందువల్ల వంటమనుషులు చేయవలసిన పనుల్ని పురమాయించటంలోనూ, వారికి కావలసిన వస్తువుల్ని సమకూర్చటంలోనూ, వారు భుజంగరావుగారికి కాఫీని పంపించాలన్న విషయాన్ని మరిచిపోయారు. సహజంగా ఆ పరిస్థితుల్లో ఎవరున్నా ఈ అనుభవానికి లోనుగాక మానరు.

'ఉదయం కాచిన కాఫీనే మళ్ళీ వెచ్చబెట్టుకుని త్రాగమంటాడా? ఎంత నిర్లక్ష్యం? నేనంటే ఏమనుకున్నాడో? నా తడాఖా చూపిస్తాను. అపుడనగా వెళ్ళిన వాడు మళ్ళీ మొహం చూపించటంలేదు. ఎంత అవమానం! ఎంత అవమానం?' భుజంగరావుగారి కేకలకి విడిదిల్లు అదిరిపోతోంది.

వారి కుభయపక్షాలవారెందరో సర్దిచెబుతూనే వున్నారు. పెళ్ళికొడుకూ, అతని తల్లిదండ్రులూ కూడా ఆయనకి నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. కాని సఫలీకృతులు కాలేకపోయారు.

'తానిక ఒక క్షణంకూడా అక్కడ ఉండబోయేదిలేదనీ, తానీ అవమానం భరించలేననీ' విశదంచేస్తూ వెంటనే సామానుల్ని సర్దమంటూ భార్య నాదేశించి, జీపుని సిద్ధం చేయమంటూ తన డ్రైవర్ని పురమాయించారు భుజంగరావుగారు.

ఈ వార్త క్షణాలమీద పెళ్ళికూతు

రింటికి పోకి వెళ్ళింది. జానకిరామయ్యగారు కంగారుగా పరుగెత్తుకొచ్చారు. వస్తూనే భుజంగరావుగారిని క్షమాపణ వేడుకున్నారు.

'చాలు చాల్లెండి! మీ మర్యాదలూ, మీరూనూ! అవమానం చేస్తారటయ్యా? అవమానం!? అదీ నన్ను?! చేయండి! మీ కూతురి పెళ్ళి నిర్విఘ్నంగా జరపండి! నేనిక్కడిహ క్షణం వుండేది లేదు.'

జానకిరామయ్యగారూ, యింతలోనే అక్కడికి చేరుకున్నవారి సతీమణీ, తదితరులూ, ఎందరు బతిమిలాడుతూన్నా భుజంగరావుగారి ఆగ్రహం చల్లారటంలేదు.

యింతలో టౌను కెళ్ళాల్సిన పాలేరు కాస్తా సైకిలుతోసహా విడిదిలో కొచ్చి కేకేసేడు.

'బాబుగారూ! పంపూ, పత్రికలు కాక మరేటి తేవాలేటండీ?'

భుజంగరావుగారి పరామర్శల్లోనే మునిగి తేలుతూన్న జానకిరామయ్యగారు తలెత్తి 'వెళ్ళి త్వరగా రారా! మరేమీ అవసరం లేదు' అన్నారు.

యిది విన్న ఆ యిద్దరమ్మాయిలూ తరాజువ్వల్లా లేచారు.

'మేం గంటన్నరనుంచీ బాత్‌రూంలో పడి గప్పులు పడుతూంటే యిప్పుడా వీళ్ళ పంపుకోసం టౌనుకి పంపేది? అవతల పెళ్ళి ముహూర్తం మించి పోతోంది. డాడీ! చూచారా? పిల్లకి పేమంటే ఎంతనిర్లక్ష్యమో? పదండి! మనమూ వెడదాం!' అన్నారు తండ్రి వంక చూస్తూ. బిడ్డల అభీష్టం నెరవేర్చటమే తమధ్యేయం అన్నట్టుగా లేచి వచ్చారాయన.

'ఓ.పెంగ్! చూచావా? మీ అన్నయ్యకా బోయే అత్తవారింటి సంగతి? నవ్వంటే వింత మర్యాదో!? ఉదయం నుంచి చెబుతూంటే యిప్పుడా వీళ్ళు టౌనుకి పంపటం? అక్కడిపుడొక కాపీకూడా వుండదు. ఛా! ఛ! ఏం మనుష్యులో ఏమో? నువ్విక్కడే వుండి మీ అన్నయ్య పెళ్ళిని కళ్ళారా తిలకించు. నేనా భుజంగరావుగారి జీపులోనే వెళ్ళిపోతాను.' అంటూ లేచి తన సూటుకేసుని సర్దుకోసాగాడు పెళ్ళికొడుకు చెల్లెలిభర్త.

ఈ గొడవ విని భుజంగరావుగారి ప్రయాణాన్ని మాన్పించే ప్రయత్నంలో వున్న పెళ్ళికొడుకు తలిదండ్రులు తమ అల్లుడి ప్రయాణాన్ని వారించేందుకు వెళ్ళేరు.

విడిదంతా అల్లకల్లోలంగా వుంది. ఆ అలజడిని చూసుకుంటూ ఎవరివో కేకలు వినిపించేయి.

'ఓ జానకిరామయ్యా! యిక్కడేం చేస్తున్నావయ్యా? అవతల ముహూర్తానికో అయిదునిమిషాలు కూడా లేవు. పెళ్ళికొడుకుని తీసికొని పద!'

ఆ అయిదునిమిషాలే కాక మరో అయిదు నిమిషాలు కూడా గడిచేయి. పెళ్ళివందిరిలో ఎవరూ మిగలకుండా అంతా విడిదిలోకి దూసుకొచ్చేరు

చిట్టచివరికి కలుగచేసుకుని మరో పది నిమిషాల్లో భుజంగరావుగారిని, ఆ యిద్దరమ్మాయిలనీ, పెళ్ళికొడుకు బావగారినీ, ప్రయాణ సన్నాహాల నుంచి విరమింప చేసేరు.

సన్నాయి మేళం రాగాలాపన ప్రారంభించింది. బ్యాండు మేళం ఢాంయ్! మంది. పల్లకీ లేచివచ్చి వీధి గుమ్మం ముందు సిద్ధంగా నిలిచింది.

'పెళ్ళికొడుకుని తీసుకురండి!' అన్నారెవరో. ఆ మాటల్ని వెన్నంటుతూనే మరో కొత్త అలజడి మొదలయింది. 'పెళ్ళికొడుకు! పెళ్ళికొడుకేడి?' అన్న కేకలు విడిదింటిలో ప్రతి ధ్వనించాయి. గదులూ, పెరడూ అంతా గాలించసాగారు.

అకస్మాత్తుగా పెళ్ళికూతురింటి నుంచి వచ్చిన వో వార్త కాస్తా విడిదింట్లో గుప్పుమంది.

యింకేముంది? అంతా కళ్యాణ మండపానికి పరుగులు తీసేరు. మంటపం అవతలలో కొలువుంచిన జనమంతా ఆశ్చర్యంతో బిగుసుకు పోయేరు.

చీర చెరగూ, ఉత్తరీయపుటంచూ ముడివేసుకుని పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ హోమగుండం చుట్టూ గంభీరంగా ప్రదక్షిణాలు చేస్తున్నారు. పెళ్ళికూతురి మెళ్ళో మంగళసూత్రం మిలమిలా మెరిసిపోతోంది. వారిరువురి నుదుట మధుపర్కాలూ; శిరస్సున పెళ్ళముత్యాలూ, జీలకర్రా అందరి దృష్టినీ ఆకట్టుకున్నాయి.

నిశ్శబ్దం గూడుకట్టుకు పోయిన ఆ వాతావరణంలో పురోహితుడి మంత్రోచ్చారణ తారాస్థాయినందుకుంది. ●






## బావిగట్టున ప్రమాదం

కృష్ణగిరి తాలూకా వేప్పనపల్లికి చెందిన 30 ఏళ్ళ వెంజమ్మాల్ అనే ఆమె బావి గట్టున బట్టలు ఉతుకుతున్నదల్లా, కాలు జారి స్వరున నూతిలో పడిపోయిందట. అది చూసి ఆమె కూతురు పార్వతి, అన్న కొడుకు వెంకటసామి భయంతో కేకలు వేసే సరికి చుట్టు పక్కలవాళ్ళు వచ్చి వెంజమ్మాల్‌ను నూతిలోంచి తీశారట. తీసిన కాస్సేపటికే ఆమె చనిపోయిందట.

### ఢిల్లీ మేయరు సాహసం

ఢిల్లీ మేయరు సహానీ కెన్యా చూడడానికి వెళ్ళారట. అక్కడ భారత రాయబారి శర్మ ఆయనను సముద్రంమీదికి వో చిన్న మోటారుబోటు వంటి దానిలో షికారుకు తీసుకువెళ్ళారట. ప్రమాదవశాత్తూ శర్మ బోటులోంచి తూలి, సముద్రంలో పడిపోయారట. ఆయన మునిగిపోయేలోగా సహానీ సాహసంచేసి సముద్రంలో దూకి ఆయనను రక్షించారట. ఆయన సాహసాన్ని శర్మ అభినందించారట.

### అగ్నిప్రమాదాలు

విజయనగరానికి చెందిన పెంట శ్రీరామపురం అనే వూరిలో సంభవించిన అగ్నిప్రమాదంలో 458 ఇళ్ళు దగ్ధం అయ్యాయట. నష్టం సుమారు రెండు లక్షల రూపాయలని అంచనాలు వేశారట. కడపజిల్లాలోని ప్రొద్దుటూరులో దేవరసెట్టి వెంకటపతిచెట్టి కాటన్ కంపెనీలో భయంకర అగ్ని ప్రమాదం సంభవించిందట. కొన్ని వందల పత్తి బేళ్ళు దగ్ధమైపోయాయట. నష్టం కొన్ని లక్షలుంటుందని అంచనాలు వేశారట. ప్రొద్దుటూరుకు 6 మైళ్ళ దూరంలో గల చిన్నసెట్టిపల్లి గ్రామంలో సంభవించిన అగ్ని ప్రమాదంలో 90 గడ్డివాములు తగులబడ్డాయట. నష్టం వో లక్ష రూపాయలుంటుందని అంచనాలు వేశారట—వాటికేం లోటు లేదు.

### పాలసీసాలో పురుగులు

ఢిల్లీ ప్రభుత్వ పాల సరఫరా సంఘం సప్లయి చేసిన వో పాల సీసాలోని పాలలో పురుగులున్నాయట. ఈ విషయాన్ని లోకసభలో పీలూమోడి ఫిర్యాదు చేస్తూ వో పురుగులున్న పాల సీసా నాయన సభకు చూపారట. కొత్తేముంది! ఇంతక్రితమిలా టివి జరక్కపోతే కదా!

### బీహారులో భయంకర హత్యలు

పిల్లలకు విషం పెట్టి చంపుతున్నారు అన్న అనుమానంమీద బీహార్‌లోని ఒకే ప్రాంతాలలో కొంతమంది గుంపులుగా చేరి వో ఇద్దర్ని 13 వ తేదీ రాత్రి కొట్టి చంపేశారట. 12, 13 తేదీలలో యీవిధంగా మొత్తం నలుగుర్ని చంపేశారట ఆగ్రహావేశాలతో అక్కడి ప్రజలు.

### పసిపిల్లలపై సిమెంటు ట్రక్కులు

మంధర అనే చోట ఆ వూరి సిమ్మెంటు కర్మాగారంనుంచి సిమ్మెంటు తేడానికి వెళ్తున్న, తీసుకు వెళ్తున్న రెండు ట్రక్కులు ఒకదాన్నొకటి ఢీకొన్న ఫలితంగా ముగ్గురు పసిపిల్లలు చనిపోయారట వాటి క్రిందపడి నలిగి. దాంతో కొందరు చూపరులు ఆ రెండు ట్రక్కులను తగలేశారట. డ్రయివర్లు తప్పించుకున్నారట.

### కుటుంబనియంత్రణ కార్యక్రమం

అయిదవ పంచవర్ష ప్రణాళికలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు మరింత విజృంభించాలనీ, వేయికి పాతిక అయినా పుట్టుక లాపాలని, కనుక అందుకు తగిన ప్రయత్నాలు చేయాలనీ కేంద్ర ప్రణాళికా సంఘం రాష్ట్రాలన్నిటినీ కోరిందట.

### అపరఖడ్గ తిక్కన

ఇండియా, పాకిస్తానూ పరస్పరం యుద్ధంతో కబుర్లాడుకుంటూ, చేసుకుంటున్న సమయంలో తాను వుండి తీరాల్సిన స్థావరాన్ని వదలి ధైర్య సాహసాలతో పారిపోయిన వో డాక్టరుగారికి 'శౌర్య చక్రా'న్ని బహూకరించిందట ప్రభుత్వం—ఖడ్గ తిక్కన కాయన సతీమణి ఏమేమి చూపెను! ఇచ్చెను!!

### అంచనా తప్పిన డాక్టర్లు

మిల్‌ఫోర్డ్‌లో ఎమ్మాక్లాంటన్ అనే ఆమె పుట్టినపుడు డాక్టర్లామెను పరీక్షించి, ఆమె 19 ఏళ్ళకన్నా ఎక్కువ కాలం బ్రతకదని చెప్పారట. ఇది జరిగి వందేళ్ళయిందట. ఆమె కిప్పుడు వందేళ్ళు నిండాయట. ఇనన్నంతమాటన్న డాక్టరుని పిలిచి యిప్పుడేమంటారు అని అనిచూదాలంటే ఆడాక్టర్లు యిప్పుడు లేరుకదా! 'నేను 19 ఏళ్ళు దాటి యిక బ్రతకనే బ్రతకనని జోస్యం చెప్పిన డాక్టర్లే లేరు. పాపం!' అంటదామె. కొన్ని విషయాలు చెప్పడం కష్టం పోస్సులుగాదా!

### అగ్నికి ఆహుతయిన పంట

ఆత్మకూరుకు చెందిన పేరారెడ్డిపల్లిలో సంభవించిన అగ్నిప్రమాదంలో తాటాకు యిళ్ళు 150 తగులబడిపోయాయట. కొన్ని పశువులు కూడా ఆహుతై పోయాయట 85 టన్నుల ధాన్యం, 4 టన్నుల మిర్చి, 10 టన్నుల వేరుశనగ కూడా కాలి దగ్ధమైపోయాయట. ఆస్తి సుమారు 4 లక్షల వరకూ నష్టముండుండవచ్చుట. అవునుగానీ, 4 టన్నుల మిర్చి కాలితే గొంతు చాల వచ్చుందరూ? అక్కడి వాళ్ళెలా భరించారబ్బా!

### నిరుద్యోగుల సమస్య

పవిత్ర భారతదేశంలో 187 లక్షల మంది నిరుద్యోగులున్నారట. ఈ విషయాన్ని పార్లమెంటుకు నిరుద్యోగం లెక్కలు తీసిన తత్సంబంధ సంఘం నివేదించిందట. ఉద్యోగులెంతమందనలు అందునా సదుద్యోగాల్చేసే వారెంత మంది!

### సిటీబస్సు దగ్ధం

విశాఖపట్టణం అలంకార్ టాకీసు ప్రాంతంలో నౌ కాలేజీ విద్యార్థిని కొట్టారన్న కోపంతో 16 వ తేదీ మధ్యాహ్నం ఎల్లమ్మతోట ప్రాంతంలో విద్యార్థులంతా చేరి 13 వ నెంబరు సిటీ బస్సును దగ్ధం చేసి స్థిమితపడ్డారట. అనక్కొన్ని బస్సులమీద చెదురు మదురుగా రాళ్ళు రువ్వారట.

### కొడవలితో హత్య

ఆరూరు తాలూకా మండియ పాడి గ్రామానికి చెందిన కందస్వామి గవుండర్ అనే వ్యవసాయి సైకిలుమీద బిడసల్‌పట్టి రోడ్డుమీద పోతుండగా వో యువకు డాయన నాపి, కొడవలితో ఆయన తలను శరీరంనుంచి వేరు చేసి, ఆ తలను తీసుకుని మరియమ్మగుడికి పారిపోయి, ఆ గుడి ముం దాతలను పడేసి, తనను పట్టుకోవాలని ప్రయత్నించిన వారిని కొడవలితో భయపెట్టి పారిపోయాడట.

### భార్యని కొట్టి చంపిన భర్త

ఆర్కాటుకు దగ్గరలోనున్న సాంబశివపురానికి చెందిన 25 ఏళ్ళ సుబ్రహ్మణ్యం అనే అతను, అతని భార్యా అనుక్షణం పోట్లాడుకుంటూండేవారట. వో నాటి పోట్లాటలో సుబ్రహ్మణ్యానికి కోపంవచ్చి తన భార్య కృష్ణమ్మ ముఖంమీద, గుండెలమీదా, వీపుమీదా శక్తి వంచన లేకుండా బాదాడట. ఆ దెబ్బల కామె చనిపోయిందట.

### కంసుని వారసుడు

వరట్టంపట్టి గ్రామానికి చెందిన 32 ఏళ్ళ వేలాయుధం అనే యువకుడు తన భార్య ధనభాగ్యాన్ని ఒదిలి, కుప్పమ్మ అనే ఆమెను ఉంచుకుని, ఆమె కూడా నచ్చక ఏన్నాళ్ళ క్రితం మళ్ళీ ధనభాగ్యాన్నే చేరాడట. తాను ఆమెను చేరిన ఏడ నెలలకే ఆమె పండంటి మగ పిల్లాడిని కనడంతో అతని కామె ప్రవర్తనమీద అనుమానం వచ్చి కోపంతో ఆ పసిపిల్లాడిని స్వరున లాక్కుని, క్రింద పడేసి, కాలితోమట్టి చంపేశాడట—కంసునికన్నా వో పాలు దుర్మార్గుడే యీతడు!



'కళావాహిని' వారు ప్రదర్శించిన 'పాండవ ఉద్యోగ విజయములు' నాటకంలో ఒక దృశ్యం. పాండవులతో యుద్ధం వస్తే ఫలితాలు ఎలా ఉంటాయో దుర్యోధనుడికి వివరిస్తున్న శ్రీకృష్ణుడు.

**అవీ — ఇవీ . . .**

## మదరాసులో 'పాండవ ఉద్యోగ విజయాలు'

స్థానిక తెలుగు సాహితీ సాంస్కృతిక సంస్థ 'కళావాహిని' అధ్వర్యంలో మే 24వ తేదీ సాయంత్రం విజయవాడ ఆంధ్రా ఆర్టిస్ట్స్ అసోసియేషన్ తరపున శ్రీ పీసపాటి నరసింహమూర్తి అండ్ పార్టీ వారిచే ప్రసిద్ధ పౌరాణిక నాటకం 'పాండవ ఉద్యోగ విజయాలు' ప్రదర్శించ బడింది.

పాత్రధారులందరూ పేరుపొందిన నటులే కాబట్టి నాటకాన్ని ప్రజారంజకంగా ప్రదర్శించి రక్తికట్టించారని వేరే చెప్పనక్కరలేదు. ముఖ్యంగా అశ్వత్థామ పాత్రధారి చక్కని కంఠం ప్రేక్షకుల చేత 'వన్స్‌మోర్' అనిపించింది.

నాటకం ప్రారంభంలో కళావాహిని సంస్థ తరపున శ్రీ రమణమూర్తి తమ పరిచయ వాక్యాల అనంతరం ఇటీవల కీర్తిశేషులైన శ్రీయుతులు తాపీధర్మారావు, అద్దంకి శ్రీరామమూర్తి, కె. వెంకటేశ్వరరావు, ఆంధ్ర ముఖ్యమంత్రి గార్ల మృతికి సంతాప సూచకంగా ఒక నిమిషం పాటు మౌనాన్ని పాటించి శ్రద్ధాంజలి ఘటించవలసిందిగా ప్రేక్షకులని కోరారు.

(ఓ. వి.)

## కళాభారతి అధ్వర్యంలో రెండు నాటికలు

మదరాసులో తెలుగు సాంస్కృతిక కార్యక్రమాలని పెద్ద ఎత్తున నిర్వహిస్తున్న కొద్ది సంస్థలలో ఒకటైన 'కళాభారతి' అధ్వర్యంలో మే 30వ మ్యూజిక్ అకాడమీలో రెండు నాటికల ప్రదర్శన జరిగింది.

డాక్టర్ రాజారావు ఆర్ట్స్ ఏకాడమీ మదరాసు వారు సమర్పించిన 'పావలా', నిడదవోలు 'రాఘవ కళా నిలయం' వారు ప్రదర్శించిన 'కళ్ళు' నాటికలు ప్రేక్షకులని అలరించాయి.

శ్రీ గణేష్ పాత్రో రచన, శ్రీ పి. జె. శర్మ దర్శకత్వ నిర్వహించిన 'పావలా' నాటికలో శ్రీయుతులు కాకరాల, తారాకృష్ణ, సువాసు, శ్రీనివాసు, ప్రకాశరావు, కుమారి విజయబాల నటించారు. తూర్పుయాస తెలుగు ఉచ్చారణలో విజయబాల ప్రదర్శించిన నేర్పు మెచ్చుకోదగినదిగా ఉన్నది. నటీ నటులంతా చక్కని పాత్ర పోషణతో నాటకాన్ని రక్తికట్టించినా, మైక్ సరిగా పనిచేయక కొన్ని సంభాషణలని ప్రేక్షకులు వినలేక పోయారు.

శ్రీ గొల్లపూడి రచనని, శ్రీ బి. వి. రామారావు దర్శకత్వాన్ని నిర్వహించిన 'కళ్ళు' నేటి సమాజంలోని కుళ్ళుని కళ్ళకు కట్టినట్టు చూపిస్తుంది. ఈ నాటికలో శ్రీయుతులు జవ్వాది రామారావు, వి. బి. ఎస్. ఎన్. రాజు, కె. వి. సుబ్బారావు, వీరభద్రరావు, బాబూరావు, చంద్రరావు, శ్రీమతి రాజకుమారి నటించారు. రచయితభావాలని, ఊహాలని, పాత్రలలో ప్రతిబింబింపజేయుటలో నటీ నటులందరూ చక్కని నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

మదరాసులోని తెలుగువారికి రెండు మంచి నాటికలని అందించిన 'కళాభారతి' వారు ముందు ముందు ఇంకా మంచి మంచి సాంస్కృతిక కార్యక్రమాలని నిర్వహిస్తారని ఆశించ వచ్చు.

(ఓ. వి.)

## తోలుబొమ్మలాట కళాకారుల జపాన్ పర్యటన

ప్రఖ్యాత తోలుబొమ్మలాట కళాకారులు శ్రీ లక్ష్మీ బృందం వారు జపాన్ వారి ఆహ్వానాన్ని పురస్కరించుకుని, ఆదేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రదర్శనలు ఇవ్వడానికి జూన్ 5వ తేదీన మదరాసు నించి బయలుదేరి వెళ్ళారు, ఆచార్య ఎం. వి. రమణమూర్తి, శ్రీమతి సీతాలక్ష్మి, శ్రీ ఎం. వి. రత్నాజీరావులు గల ఈ బృందం జపాన్‌లో రెండున్నర నెలలు పర్యటిస్తుంది. (ఓ. వి.)

* * *

జూన్ రెండవ వారంలో రవీంద్ర భారతి మినీ థియేటర్‌లో సంఘమిత్ర అసోసియేషన్, హైదరాబాద్ ఆధ్వర్యంలో సాంస్కృతిక పోటీలు జరుగనున్నవి.

వివరములు పోస్టు ద్వారా శ్రీమతి విమల్ ద్యులాంకర్, (సంఘమిత్ర) 23—5—835 షాలిబండ, హైదరాబాద్—2 (ఓ. వి.)



మే 17తేదీన మద్రాసు అబాట్స్‌బరీలో నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజుగారి ద్వితీయ కుమార్తె వివాహం జరిగిన సందర్భంలో తీసిన ఛాయా చిత్రం. వధువు: చి.సౌ. రమాదేవి, వరుడు: చి. లక్ష్మీనరసరాజు. వధువు కుటుంబ సభ్యులని కూడా చిత్రంలో చూడవచ్చు.

# పుస్తకాలు

## హెడ్ మిస్ట్రెస్ హేమలత

(శ్రీ అవసరాల రామకృష్ణారావు, నవజ్యోతి పబ్లికేషన్సు, విజయవాడ, 271 పేజీలు, వెల: రూ.6.

చిన్న నాంలోనే (హైస్కూలు విద్యార్థినిగా వున్నప్పుడే) లోకాన్ని పరమ్మత్తు చెయ్యాలనే ఆశయ సాధన నాగరాజులో మొదలుపెట్టబోతే అతగాడు కాటువేశాడు హేమలతను. ఫలితంగా అతగాడిని పెళ్లి చేసుకోవాల్సిన పరిస్థితి యేర్పడింది. తప చెడు అలవాట్ల ఫలితంగా హేమలతతో పెళ్లి (బలవంతంగా చేసిన పెళ్లి) అయిన వెంటనే మరణిస్తాడు నాగరాజు. తర్వాత హేమలత హెడ్ మిస్ట్రెస్ అవుతుంది. చంద్ర ఆమె కూతురు. చివరకు చంద్రకు రాజేశ్వరరావు అనే ఆదర్శవిద్యార్థి సాహచర్యం లభిస్తుంది. ఇదీ కథ. దీంట్లో హేమలత అక్క కుటుంబం (పెద్దది)లోని సభ్యులూ యింకా యితర పాత్రలూ వస్తాయ్. నేటి విద్యాలయాల లోనూ (బయట కూడా) విద్యార్థుల ప్రవర్తన, అధ్యాపకుల తీరుతెన్నులూ చక్కగా విపులీకరించారు రచయిత (ఉమ్మడి కుటుంబంలోని సాధకబాధకాలు, సాధింపులు వగైరాలతోబాటు కొన్ని బోధనలు కూడా వున్నాయ్.) అసలు నవల అందుకోసమే వ్రాయబడింది. నవలలో వుండాల్సిన కథాగమనం మీదకంటె పైన చెప్పిన విషయంపై చర్చలకే ప్రాధాన్యం యివ్వబడింది. నవలలో వచ్చే పాత్రల పరమార్థం యీ చర్చలను కొనసాగించటమే.

మనకున్న కొద్దిమంది సమర్థవంతమైన రచయితల్లో రామకృష్ణారావుగారు వకరు. విద్యా విషయాలను విమర్శనా దృష్టితో చూడగల సామర్థ్యం అధ్యాపక వృత్తిలో వున్న వారి హక్కు. కానీ యీ సమస్యల చర్చను నవల అనే చట్రంలో మరింత పటిష్ఠంగా బిగించినట్లయితే కొన్ని కొన్ని చోట్ల చదివేది వ్యాసమా, కథా అన్న అనుమానం పాఠకులకు కలిగే అవకాశం వుండేది కాదు. కొన్నిచోట్ల పాత్రలు యిలాంటి చర్చలలో పాల్గొనటమే తమ లక్ష్యం అనే వుద్దేశ్యంతో వకదాని వెంట మరొకటి చర్చా ప్రాంగణంలోకి పిలవనిపేరంటంగా చొరబడి సీటులు వాల్చుకుని కూర్చుంటయ్. నిజానికి వాటి అవసరం కూడా అంతవరకే. హెడ్‌మిస్ట్రెస్ హేమలత కూడా వక్తృత్వపు పోటి నిర్వహించే అధ్యక్షుని మాదిరే ఎప్పుడెప్పుడూ చర్చల్లో పాల్గొంటూ వుంటుంది. ఇన్ని పాత్రల మధ్య మునిగిపోయిన హేమలత అప్పుడప్పుడూ పైకి తేలుతూ వుంటుంది. వ్యాసరచనకు యితివృత్తమయిన విషయాల్ని కథా రూపంలోకి తేవటం కష్టమయిన పని. అందుకే కొంతలు బుచ్చిబాబు లాంటివారు ప్రయోజనానికి అవసరమైతే వ్యాసాలు వ్రాయమన్నారు.

ప్రతి క్లాసులోనూ 'సెక్స్ గ్రూపింగ్' ఆవశ్యకతను రచయిత చక్కగా వివరించారు, విద్యావేత్తలు గుర్తుంచుకోవలసిన విషయం యిది.

'లోకంలో తెలివి తక్కువ మంచి వాళ్లకంటె తెలివైన దుర్మార్గులవల్ల అపకారం యెక్కువ జరుగుతుందని నాన్న అంటుంటాడు' — అంటుంది చంద్ర (పేజి 16).

చంద్ర తండ్రి నాగరాజు చంద్ర పుట్టకమునుపే చచ్చిపోతాడు. హేమలత కూడా నాగరాజును సహ విద్యార్థిగా యెరుగును గానీ పెళ్లిఅయిన తర్వాత భర్తగా అతనితో 'కాపరం' చెయ్యలేదు. దురదృష్టవశాత్తు ఆ చేసేదేదో ముందే చేసింది. మరి చంద్ర 'నాన్న అంటుంటాడు' అనటంలో అర్థ మేమిటో?

ఈ పుస్తకం విద్యార్థులు, అధ్యాపకులు, విద్యా విధానంతో ప్రత్యక్షంగాగానీ పరోక్షంగాగానీ సంబంధమున్న అందరూ చదవాలి.

రాఘవమ్మ పాత్రను రూపొందించటంలోనూ, నడిపించటంలోనూ రామకృష్ణారావుగారి సామర్థ్యం కనిపిస్తుంది. ఈ పాత్రను పాఠకులు చాలాకాలం గుర్తుంచు కుంటారు.

—శ్రీనాథుడు.

## రెండు పుస్తకాలు

**(1) క్రాంతి రథం.**

రచన: జె. వీరాస్వామి. మూల్యం: రెండు రూపాయలు.

**(2) ప్రగతి పథం.**

రచన: దేవరపల్లి మస్తాన్‌రావు. మూల్యం: రెండున్నర రూపాయలు. ప్రచురణ: పురోగామి ప్రచురణలు, పొన్నూరు.

రేడియో ప్రసంగాలు, పత్రికా వ్యాసాలసంపుటి క్రాంతిరథం.

ఉపన్యాసాల సంపుటి ప్రగతి పథం.

పదమూడు వ్యాసాలున్నాయ్ క్రాంతిరథంలో. ఒక పద్ధతిలో, పరిణామంలో భాగంగా మార్పులను ఆకాంక్షించుతున్న ప్రసంగాలూ, వ్యాసాలూ క్రాంతి రథంలో ఉన్నయ్. విజ్ఞులు ఆలోచించవలసిన అంశాలున్నయ్ యీ సంపుటిలో. వెనుకబడిన తరగతులకు సంబంధించిన సమస్యలను పది వ్యాసాలలో ప్రగతిపథంలో శ్రీ మస్తాన్‌రావు చర్చించారు.

వోటర్ల లిస్టునుంచి తొలగించారు కులం
బూటకపు లెక్కల గారడీకిది బలం
వోట్లున్నవారికి సీట్లు రాకపోవడం
సోషలిజం కంఠశోష కావటం
కమ్యూనిజంలో కమ్యూనలిజమున్నుండటం.
(16 వ పుట).

వంటి రచనలు ప్రగతి పథంలో వైలు రాళ్ళవుతయ్.

ఇంతకూ ఈ రచయిత ఆవేశమంతా వెనుకబడిన తనం గురించా? వెనుకబడిన తరగతులను గురించా? వెనుకబడిన తనమనేది కొన్ని కులాలకు మాత్రమే పరిమితమయినట్టి లోపం కాదు. అన్ని కులాలలోనూ, వర్గాలలోనూ ఉన్నది ఈ లోపం. కనుకనే 'వెనుకబడిన తరగతుల ఉద్యమపు వేడిని, వాడిని గ్రహించాలంటే ఈ గ్రంథాన్ని ప్రతి సంఘ సేవకుడూ, ప్రతి రాజకీయవాది తప్పక చదవాలి. చదివి ఆలోచించాలి" అంటున్నారు ఆ ముఖములో శ్రీ ఎస్. వి. రామమూర్తి గారు.

చదువులు తక్కువయిన కారణంగా మాత్రమే మానవ స్వభావం యీ నాటి దశకు చేరినదవగలమా? మానవ స్వభావం ఎట్లా మారుతుందనేదే గదా అసలు సమస్య? ప్రబోధాలూ, ప్రవచనాలూ, తర్కాలూ వాదోపవాదాలు వర్తమానంలోని సమస్యలను పరిష్కరించుతవా? మానవుని కోరికనూ, హేతువాదాన్నీ సమన్వయం చేసే ఉపాయమేమిటి? అవే దృష్టితో పరిశీలించితే యీ రెండూ మంచి పుస్తకాలేనని సహృదయులూ హేతువాదులూ అంగీకరించుతారా?

—వి. ఎస్. అవధాని.

## మ హ తి

తెలుగు సాంస్కృతిక సమితి, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, మదరాసు వారి నిర్వహణలో వెలువడిన 'మహతి' ప్రమాదీచ సంచిక మా కార్యాలయం చేరింది. 48 పేజీలు, వెల అమూల్యం.

## ర ం జ ని

హైదరాబాదు ఎ. జి. ఆఫీసు తెలుగు సాహితీ సమితివారు వెలువరించిన రంజని 12వ సంపుటం సంచిక 12 మా కార్యాలయం చేరింది. 116 పేజీలు, వెల అమూల్యం.

## వా ణి

'వాణి' పత్రికను 'సైక్లో స్టయిల్'లో ప్రచురించినా కెనడాలోని ఆంధ్రులు ఈ పత్రికను నిర్వహిస్తున్నారూ అంటే ఆశ్చర్యంగానూ, సంతోషంగాను వుంటుంది. దేశంకాని దేశంలో ఒక తెలుగు పత్రిక వెలువడుతున్నది అంటే— అక్కడి తెలుగువారి భాషాభిమానాన్ని కొనియాడి తీరాలి.

ఇందులో కథలూ, గేయాలూ, వైజ్ఞానిక వ్యాసాలు అనేకం వున్నాయి. రచనల స్థాయికూడా తక్కువదిగా లేదు. వివిధ శీర్షికలతో బొమ్మలతో వెలువడే ఈ పత్రికకి పి. ఎస్. రావుగారు సంపాదకులు. ఎడ్మంటన్ ఆంధ్ర సాంస్కృతిక సంఘం తృతీయ ప్రచురణ. వివరాలకి డా. పి. ఎస్. రావు, డిపార్టుమెంట్ ఆఫ్ కెమిస్ట్రీ, యూనివర్సిటీ ఆఫ్ ఆల్‌బెర్టా, ఎడ్మంటన్, కెనడాకు రాయాలి.

(ఊ. వ.)

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.



స్నేహబంధంలో కృష్ణ, జమున

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

